సాక్షి
# ఫన్‌డే

ఆదివారం :: 16 ఏప్రిల్ 2017

# ఎండ రుచులు

అప్పడాలు
వడియాలు
ఒరుగులు
ఎండు ఊరగాయలు

7వ పేజీలో...



# పిల్లలు పుట్టరేమోనని బాధ పడవద్దు



**తెలుగు రాష్ట్రాల్లో ప్రఖ్యాతి గాంచిన సంతాన వైద్యనిపుణురాలు డాక్టర్ పద్మలత యారాశి వెల్లడి**

**సంతానరాహిత్యంతో అలమటిస్తున్న వేలాది కుటుంబాల్లో పసిపిల్లల చిరునవ్వులు చిందించిన సక్సెస్‌ఫుల్ డాక్టర్**

ప్రశ్న: డాక్టర్ గారికి నమస్కారం
నా వయస్సు 38 సంవత్సరాలు.ముగ్గురు చెల్లెళ్ళు.వారి పెళ్ళిళ్ళు చేసే బాధ్యత నాపైనే ఉండటం వల్ల నేను పెళ్ళి చేసుకోలేదు. ఇప్పుడు చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు అయిపోయాయి. ఇక పెళ్ళి చేసుకోవాలని అనుకుంటున్నాను.వయస్సు ఎక్కువై పోవటం వల్ల నాకు ఇదివరకటిలా అంతగా సెక్స్ కోరికలు లేవు. ఈ వయస్సులో నేను పెళ్ళి చేసుకుంటే నాకు పిల్లలు కలుగుతారా? లేదా? పెళ్ళి చేసుకున్నాక పిల్లలు కలగకపోతే జీవితాంతం నేను బాధపడాల్సి వస్తుందని బెంగగా ఉంది. ఇన్నాళ్ళు చెల్లెళ్ళ గురించి బాధపడ్డాను. ఇక ముందు పిల్లల గురించి బాధపడాలా? పెళ్ళికి ముందే నేను తండ్రినయ్యే అవకాశం ఉందో? లేదో? తెలుసుకోవచ్చా?

యం.హరికృష్ణ, మామునూర్

జవాబు: హరికృష్ణ గారు.. తల్లితండ్రులు చేయాల్సిన ముగ్గురు ఆడపిల్లల పెళ్ళిళ్ళు 38 ఏళ్ళ వయస్సులోనే మీరు చేసినందుకు అభినందనలు. బాధల్ని దిగమింగుకుని బాధ్యతల్ని నెరవేర్చటం ఎవరి జీవితం లోనైనా అతి కష్టమైన టాస్క్. ఈ క్రమంలో మీరు మీ జీవితాన్ని, భవిష్యత్తును రిస్క్‌లో పడవేశారన్నది మాత్రం నిజం. కుటుంబంలో కష్టాలు, సమస్యలు, భాదలు ఒక్కొకరికి ఒక్కొరకంగా ఉంటాయి. అంతమాత్రాన అవన్నీ తీరాకే పెళ్ళి చేసు కోవాలనుకోవటం కరెక్ట్ కాదు. పెళ్ళీడుకు వచ్చిన పిల్లలుండాల్సిన వయస్సులో పెళ్ళి చేసుకోవాలనుకుంటే చాలా సమస్యలు ఎదురవుతాయి.

1.దాంపత్య సుఖం పట్ల ఆసక్తి తగ్గటం వల్ల భార్యభర్తల కలయికలు అతి తక్కువగా జరుగుతాయి.

2. అతి తక్కువగా జరిగే ఆ కలయికలు కూడా స్త్రీలలో అండం విడుదలయ్యే రోజులలో జరగకపోతే.. పిల్లలు పుట్టరు.

3.వయస్సు పెరిగి.. ఆసక్తి తగ్గిన మగవాళ్ళల్లో వీర్యం ఉత్పత్తి శాతం పడిపోతుంది.

4.ఒకమిల్లి లీటర్ వీర్యంలో 1.5 కోట్లకు పైగా ఉండాల్సిన శుక్రకణాల సంఖ్య.5కి పడిపోవచ్చు.

5.చురుకుగా తిరిగే కణాల సంఖ్య 75 లక్షల నుండి వేలల్లోకి దిగిపోవచ్చు.

6.సమర్థవంతంగా.. పటిష్టంగా ఉండాల్సిన కణాల ఆకృతి పేలవంగా,నిస్తేజంగా మారిపోవచ్చు.

ఇవన్నీ వీర్యపరీక్షలు చేస్తే గానీ బయటపడవు.పరీక్షలు చేసి. నిజంగానే ఏమైనా సమస్యలు ఉన్నాయని తేలితే..వాటిని ప్రత్యేకమైన వైద్య చికిత్సలతో అధిగమించవచ్చు. అప్పుడు పిల్లలు పుట్టే అవకాశం ఉంటుంది.

శుక్రకణాల సంఖ్య తక్కువ ఉంటే వాటిని పెంచే వైద్య విధానం అందుబాటులో ఉంది.

40 శాతం ఉండాల్సిన కణాల చలనం మందకొడిగా మారిపోతే.. కణాల చురుకుగా కదిలేలా చికిత్స చేయాల్సి ఉంటుంది.

4 శాతం ఉండాల్సిన కణాల ఆకృతిని కాపాడుకునే వైద్యం అందుబాటులో ఉంది. ఇతరులు సుఖం కోసం మీ సుఖాన్ని కోల్పోవద్దు. పిల్లలు పుట్టరేమోనని బాధపడవద్దు. సంతాన రాహిత్యానికి సంబంధించిన అన్ని సమస్యలనూ ఆధునిక వైద్య విధానంతో చకిత్స చేస్తే... తప్పకుండా పిల్లలు పుడతారు.

ప్రశ్న: డాక్టర్ గార్కి నమస్కారం. నా వయస్సు 20 సంవత్సరాలు. నాభర్తకు 30 సంవత్సరాలు. నాభర్త మొదటి భార్య చనిపోతే నన్ను రెండవ పెళ్ళి చేసుకున్నారు. ఆయనకు ఇంతకు ముందే ఒక అబ్బాయి ఉన్నాడు. మా పెళ్ళయి సంవత్సరం అయినా ఇంకా మాకు పిల్లలు పుట్టలేదు.లోపం నాదేనా? నేను ఎలాంటి చికిత్స తీసుకోవాలి?

పి.ప్రభావతి,ఖిలా వరంగల్.

జవాబు: మీ భర్తకు అంతకు ముందు అబ్బాయి ఉన్నాడు కాబట్టి.. ఇప్పుడు పిల్లలు పుట్టడం లేదంటే లోపం మీదేనని డిసైడ్ కావద్దు. మీ వయసుల్ని బట్టి చూస్తే మీకు పిల్లలు పుట్టే అవకాశాలు ఉన్నాయి. నిపుణులైన వైద్యుల్ని కలిస్తే.. మీ నెలసరి వివరాలు, భార్యాభర్తల కలయికల వివరాలు తెలుసుకుని కొన్ని సలహాలు,సూచనలు ఇస్తారు.అవి పాటించండి.అప్పటికీ పిల్లలు కలగకపోతే.. భార్యాభర్తలిద్దరికీ కొన్ని సాధారణ పరీక్షలు, పురుషులకు వీర్య పరీక్షలు చేస్తారు. అప్పుడు ఏమైనా ఇబ్బందులు ఉన్నాయని తేలితే డాక్టర్లు అందించే చికిత్స ద్వారా ఎలాంటి సమస్యలున్నా తీరిపోతాయి. పిల్లలు పుడతారు.

ADVT



## మాతృత్వ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్

**హైదరాబాదు**
ఫ్లాట్ నెం: 29, రోడ్ నెం- 01, జూబ్లిహిల్స్, ఫిల్మ్‌నగర్, హైదరాబాదు. ఫోన్ : 9100222604

**తిరుపతి**
మాతృత్వ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్
మా భూమి టవర్స్, డోర్ నెం: 18-1-302ఎ/ఎ1
భవాని నగర్, కెటి రోడ్, తిరుపతి ఫోన్ : 8099922895

**కోరమంగళ**
మాతృత్వ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్
సైట్-2, బి బ్లాక్, 100 ఫీట్‌రోడ్, కోరమంగళ ఎక్స్‌టెన్షన్, బెంగుళూరు. ఫోన్: 09108446553

**బెంగుళూరు**
మాతృత్వ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్
57/1, ఈస్ట్‌పార్క్‌రోడ్, మల్లేశ్వరం, బెంగుళూరు. ఫోన్: 09108446553

**హొసూరు**
విజయ్ సృష్టి ఫెర్టిలిటీ సెంటర్,
నెం: 76, ఓల్డ్ బెంగుళూరు రోడ్, హొసూరు
ఫోన్: 09944827846

**కర్నూలు**
మాతృత్వ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్
డోర్‌నెం. 50-760, ఫస్ట్ ఫ్లోర్, విశ్వభారతి హాస్పిటల్ లేన్, గాయత్రి ఎస్టేట్స్, కర్నూలు. ఫోన్: 7331164105



**ప్రొద్దుటూరు**

## పద్మ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్

ప్రొద్దుటూరు, కడప జిల్లా.
ఫోన్ : 9100775988, 9704555302

● టాప్ స్టోరీస్



**జీవన సారం**



ఆహారంపై ఉండే ప్రేమ కంటే
నిజాయతీ గల ప్రేమ మరేదీ ఉండదు.

- జార్జ్ బెర్నార్డ్ షా,
ప్రముఖ రచయిత



● హేవ్ ఫన్

# వేడియం

ఆ రోజు ఎండ కొంచెం ఎక్కువగానే ఉంది. ఇంటికి వచ్చిన రుద్రాక్ష్ చిరాగ్గా ఉన్నాడు.

'బాగా ఎండగా ఉంది కదూ' మాట కలిపింది భార్య అనిత.

ఉలుకూ పలుకూ లేదు. టిఫిన్‌డబ్బా కిచెన్‌లోకి తీసుకెళ్ళాడు. కడిగి సింక్ మీద వాలుగా పెట్టాడు... నీళ్ల కారిపోవడానికి.

డబ్బా ఊగి ఊగి జారి ఫెళ్ళుమని కింద పడింది.

పీడకలకు ఉలిక్కిపడి ఏడ్చిన చంటిదానిలాగా.

భార్యాభర్తల మధ్య ఉన్న నిశ్శబ్దాన్ని గట్టిగా అరిచి మరీ గుర్తు చేసింది టిఫిన్‌డబ్బా.

'ఏమయ్యింది' అడిగింది అనిత.

'ప్రమోషన్ రాలేదు, జీతం పెరగదు.. సారీ... నిన్ను సుఖపెడతానని మీ నాన్నకు చెప్పి పెళ్లి చేసుకున్నా... ప్చ్... వెరీ సారీ..!'

చీర చెంగుతో భర్త చేతికున్న తడిని తుడిచి డైనింగ్ టేబుల్ దగ్గరకు తీసుకెళ్లింది అనిత. ప్లేట్‌లో అన్నం వడ్డించి పప్పుచారు పోసి ముద్దలు కలిపి నోటికి అందించింది.

ఆఫీస్ మీద కోపం ఇంకా కొరుకుతూనే ఉంది కదా... అందుకే ముఖం తిప్పేశాడు... కానీ చివరకు అనిత కళ్ళల్లో ప్రేమను చూసి నోరు తెరిచాడు.

చేతిలో నాలుగు వడియాలు కూడా పెట్టింది.

వడియం రుచి చూసి... 'ఎంత రుచిగా ఉంది! నీకు ప్రమోషన్ ఖాయం' అని నవ్వాడు రుద్రాక్ష్.

'ప్రమోషన్ నాకు కాదు సూర్యుడికి ఇవ్వాలి. మంచి ఎండ కదండీ.. ఆ వేడికి వడియాలు రుచిగా అయ్యాయి' అంటూ ఇంకో నాలుగు వడియాలు చేతిలో పెట్టింది అనిత.

నిజమే. జీవితంలో అన్నీ అనుకూలంగా ఉండవు. ఉద్యోగంలో, ఇంట్లో, చివరికి బంధుత్వాల్లో కూడా... ప్రతి చోటా విపరీతమైన ఉక్కపోత... మనసును నీరసపరిచే ఉక్కపోత.

కానీ, ఆ వేడిలో కూడా ఎన్నో సంతోషాలను సృష్టించుకోవచ్చు వడియాల్లాగే.

వడియం రుచిగా ఉండాలంటే ఎండగొట్టాలి.

జీవితం రుచిగా ఉండాలంటే కష్టాన్ని ఎండగట్టాలి.

చేతిలోకి నాలుగు ప్రమోషన్లు అవే రావా!

ప్రేమతో...

ఎడిటర్, ఫన్‌డే & ఫ్యామిలీ


సొంత పార్టీ నేతలు
ట్రంప్
మెక్సికో రక్షణ గోడ నిర్మాణం వెనక్కి! సొంత పార్టీలోనే వ్యతిరేకత


పురందేశ్వరి


ప్రజాస్వామ్యం
ఫిరాయింపుదారులకు మంత్రి పదవులిచ్చి (ప్రజాస్వామ్యాన్ని) ఖూనీ చేసిన బాబు


దీనినే ఓల్డేజ్ హోమ్‌గా మార్చి మనం వేరే ఆఫీసు తీసుకుందాం సార్!
వృద్ధులకు వీడ్కోలు
కాంగ్రెస్‌లో ప్రక్షాళనకు రంగం సిద్ధం
Shankar

నివాసంగా మార్చుకున్న బోయింగ్-727 విమానంతో బ్రూస్ కాంప్‌బెల్







# పుష్పక నివాసం

కారు, వ్యాను, బస్సు వంటి వాహనాలను నివాసాలుగా మార్చుకున్న వాళ్లు అక్కడక్కడా ఉండటం తెలిసిందే. వాహన నివాసాలకు ఇళ్లలో ఉండే అన్ని హంగులూ సమకూర్చుకుని, యథేచ్ఛగా వాటిలోనే కాపురాలు సాగించే వారూ లేకపోలేదు. అలాంటిలాంటి ఆషామాషీ వాహనాలను ఇళ్లుగా మార్చుకుని, వాటిలో నివసిస్తే అందులో వింతా విశేషం ఏముందని అనుకున్నాడేమో ఈ అమెరికన్ ఇంజనీరు. ఓరెగాన్ రాష్ట్రంలోని పోర్ట్‌లాండ్‌కు చెందిన బ్రూస్ కాంప్‌బెల్ అనే ఈ మేధావి ఏకంగా ఆధునిక పుష్పక విమానంలాంటి బోయింగ్-727 విమానాన్నే తన నివాసంగా మార్చేసుకున్నాడు. మూడు ఇంజన్లతో పనిచేసే ఈ భారీ విమానాన్ని ఓరెగాన్ అడవుల మధ్య నిలిపి, ఇందులో సమస్త సౌకర్యాలనూ ఏర్పాటు చేసుకున్నాడు. విమానంలో నివసించాలనే కల సాకారం చేసుకునేందుకు ఇతగాడు ఓరెగాన్ అటవీ ప్రాంతంలో ఏకంగా పది ఎకరాల స్థలాన్ని కొనుగోలు చేశాడు. ఆ తర్వాత వాడుక నుంచి విరమణ పొందిన పాత బోయింగ్ విమానాన్నీ కొనుగోలు చేశాడు. స్థలం కోసం 23 వేల డాలర్లు (సుమారు రూ.15 లక్షలు), విమానం కోసం 2.20 లక్షల డాలర్లు (రూ.14.28 లక్షలు) ఖర్చు చేశాడు. బ్రూస్ ఏడాదికి ఆరు నెలలు ఈ విమానంలోనే నివాసం ఉంటాడు. మరో ఆరు నెలలు జపాన్‌లో గడుపుతాడు. ఎందుకంటారా..? అక్కడ కూడా ఇలాంటి పాత విమానం దొరికితే అర్జెంటుగా కొనేసి, అక్కడ కూడా ఇలాంటి పుష్పక నివాసం ఏర్పాటు చేసుకోవాలనే ఉద్దేశంతోనే!

• సిల్లీ బిజినెస్

# అమ్మకానికి ఆరుద్ర పురుగులు

నమ్మకాన్ని సొమ్ము చేసుకోవడమే కదా వ్యాపారమంటే! విల్కో ఫార్మ్ స్టోర్ అనే అమెరికన్ కంపెనీ ఈ సూత్రాన్ని బాగానే వంట పట్టించుకున్నట్లుంది. అందుకే బతికి ఉన్న ఆరుద్ర పురుగులను పట్టుకొని చక్కగా అందమైన డబ్బాల్లో పకడ్బందీగా ప్యాక్‌చేసి ఆన్‌లైన్‌లో అమ్మకాలు సాగిస్తోంది. పొలాల్లో, తోటల్లో, చెట్టు చేమలతో నిండిన చిట్టడవుల్లో ఎర్రగా మిలమిలలాడుతూ తారసపడే ఆరుద్ర పురుగులతో ముడిపడిన నమ్మకం ఏమంటారా..? మనం బల్లి శకునాన్ని నమ్మినట్లే పడమటి దేశాల వాళ్లు ఆరుద్ర పురుగు శకునాన్ని నమ్ముతారు. అనుకోకుండా ఆరుద్రపురుగు ఒంటి మీద వాలితే చాలు అదృష్టం కలిసొస్తుందని ఈ హైటెక్‌యుగంలో సైతం వాళ్ల బలమైన నమ్మకం. ఇలాంటి నమ్మకాలను నమ్ముకుంటే అమ్మకాలు అదిరిపోవూ! విల్కో ఫార్మ్ స్టోర్ సాగిస్తున్న అమ్మకాలను గమనిస్తే ఆ విషయం ఇట్టే అర్థమైపోతుందనుకోండి. ఈ కంపెనీ బతికి ఉన్న ఆరుద్ర పురుగులను జాగ్రత్తగా పట్టి, వాటికి గాలి ఆడే వెసులుబాటు ఉండే అందమైన డబ్బాల్లో ప్యాక్ చేస్తోంది. ఒక్కో డబ్బాలో 1500 ఆరుద్ర పురుగులు ఉంటాయి. ఒక్కో డబ్బా ఖరీదు జస్ట్ 11.8 డాలర్లు (రూ. 769) మాత్రమే. అదృష్టం కలిసొస్తుందంటే ఎవరైనా ఆ మాత్రం ఖర్చు పెట్టలేరేంటి?



# ఆయుర్వేదంతో శృంగారసమస్యలకు చెక్

పురుషుల్లో అంగస్తంభన సమస్య, శీఘ్రస్కలన సమస్యలను సర్వ సాధారణమైన శృంగార సమస్యలుగా పేర్కొంటారు. శృంగారంలో పాల్గొన్నప్పుడు అంగం తగినంతగా స్తంభించకపోవడం, ఒకవేళ స్తంబించినా చివరివరకు తగినంతగా ఉండకపోవడాన్ని అంగస్తంభన సమస్యగా పేర్కొంటారు. అంగస్తంభన సమస్యను ఆయుర్వేదపరంగా నపుంసికత లేక క్లైభ్యముగా చెబుతారు. అన్ని వయస్సులవారిలో 1/3 శాతం మంది ఈ సమస్యతో బాధపడుతున్నట్లుగా తెలుస్తోంది. ఈ సమస్య 40 సంవత్సరాల తరువాత 35 శాతం మందిలోను, 50 సంవత్సరాలు దాటిన వారిలో 50 శాతం మందిలోనూ, 60 శాతం దాటినవారిలో 60 శాతం మందిలో ఈ అంగస్తంభన సమస్య ఉన్నట్లు సర్వేల ద్వారా తెలుస్తోంది.





అంగస్తంభన సమస్యతో బాధపడేవారు మానసిక ఆందోళనకు లోనుకావడం, వారిలో ఆత్మవిశ్వాసం తగ్గడం, జీవిత భాగస్వామితో అనుబంధం సరిగా లేకపోవడం, ఎక్కువ సమయం ఒంటరిగా గడపటం వంటివి చేస్తుంటారు.

**కారణాలు :-** అంగస్థంభన సమస్య ఉన్నవారిలో అంగంలోనికి రక్త ప్రసరణ సరిగ్గా జరుగకపోవడం అనేది ముఖ్యమైన కారణంగా చెప్పవచ్చును. ఈ సమస్యతో 70 శాతం శారీరక కారణాలు, 30 శాతం మానసిక కారణాలుగా చెప్పువచ్చు. ఆల్కహాల్, డ్రగ్స్, పొగత్రాగడం, హార్మోనుల లోపాల వల్ల, మానసిక ఆందోళన, ఒత్తిడి మొదలగువాటివల్ల ఈ సమస్య వస్తుంది. మధుమేహం, అధికబరువు, కిడ్నీ సంబంధ వ్యాధులు, గుండె సంబంధ వ్యాధులు, నాడీ సంబంధ వ్యాధులు, కాలేయ సంబంధ వ్యాధులు, ఎథిరో స్క్లీరోసిస్, సుఖవ్యాదులు మొదలగు వ్యాధులు అంగస్థంభన సమస్యకు కారణంగా చెప్పవచ్చు. అధిక రక్తపోటు, గుండె జబ్బులు, డిప్రెషన్, అల్సర్స్, క్యాన్సర్ సంబంధ వ్యాధులకు వాడే మందులవల్ల కూడా ఈ సమస్య ఉత్పన్నమవుతోంది. డయాబెటిస్ వ్యాధి గ్రస్తుల్లో అంగస్తంభన సమస్యతో బాధపడేవారు 50 నుంచి 60 శాతం వరకు ఉన్నట్లు తెలుస్తోంది.

**వ్యాధి నిర్ధారణ :-** అంగస్తంభన సమస్యకు హార్మోనుల పరీక్ష, పినైల్ డాప్లర్ ద్వారా వ్యాధి నిర్ధారణ చేయవచ్చు.

**వాజీకరణ చికిత్స :-** అంగస్తంభన సమస్యకు ఆయుర్వేదంలో ఎన్నోరకాల మంచి మందులు అందుబాటులో ఉండి మంచి ఫలితాలను ఇస్తున్నాయి. ఆయుర్వేదంలో శృంగార సమస్యలు, పురుషులలో సంతానలేమికి ప్రత్యేకంగా 'వాజీకరణ' అనే విభాగం కలదు. వాజీకరణం అంటే గుర్రంలా సంభోగం చేయగలిగే సామర్థ్యం కలిగించే ఔషధాలుగా చెప్పవచ్చు. ప్రాచీన ఆయుర్వేద సంహితల ప్రకారం వాజీకరణ చికిత్స ద్వారా అంగస్తంభన సమస్యకు మంచి పరిష్కారం లభిస్తుంది. ఆయుర్వేదంలో ఈ సమస్యకు పంచకర్మ చికిత్సలు కూడా ఉపయోగకరంగా ఉంటాయి. కావున అంగస్తంభన సమస్య, శీఘ్రస్కలన సమస్య, పురుషులలో సంతానలేమికి సమస్యలతో బాధపడేవారు ఆయుర్వేదంలో పేర్కొనబడిన 'వాజీ కరణ చికిత్స' నిపుణులైన వైద్యుని ద్వారా 4-6 నెలలు మందులు వాడి మంచి ఫలితాలను పొందగలరు.

• జాతీయాలు

## అతి పరిచయం!



ఎవరినీ పట్టించుకోకుండా, తన లోకమేమిటో తాను అన్నట్లుగా ఒంటరి కొండ మీద బతకడం తప్పు.

మనిషి అన్నాక నలుగురితో కలిసిపోవాలి. సామూహిక ఆనందాన్ని సొంతం చేసుకోవాలి. ఇక్కడి వరకు బాగానే ఉందిగానీ... కొందరికి పరిచయాల పిచ్చి ఉంటుంది. కంటికి కనిపించిన ఏ వ్యక్తినైనా పరిచయం చేసుకోకుండా వదలరు. దీనివల్ల లాభం కంటే నష్టమే ఎక్కువ జరుగుతుందని చెప్పే జాతీయమే...'అతి పరిచయం అనర్థం'

ఎక్కువ పరిచయాల వల్ల ఎవరేమిటో లోతుగా అంచనా వేయలేము. దీంతో నష్ట పోవడం జరుగుతుంటుంది. అతి పరిచయం కంటే ఆచితూచి చేసే స్నేహం వల్లే మంచి జరుగుతుందని చెప్పే జాతీయం ఇది.



## నీరు-నారు-నోరు!

మనం సుఖంగా బతకాలంటే....మనలోని 'కష్టపడేతత్వం' మాత్రమే సరిపోదు.

పరిస్థితులు, కాలం కూడా కలసి రావాలి.

బాగా కష్టపడేవాడు ఒక ఊళ్లో ఉన్నాడనుకుందాం.

ఆ ఊరు ఎలాంటిదంటే...

వర్షాలు పడవు.

పంటలు పండవు.

కష్టపడి ఎలాగూ బతకలేడు, మాటలు చెప్పి బతుకుదామంటే...పెద్ద నోరు కూడా లేదు!

ఇదే రైతు... నీరు పుష్కలంగా దొరికే, పంటలు పచ్చగా పండే ఊళ్లో ఉంటే, మాటనేర్పు ఉంటే... ఇక ఆ రైతుకు తిరుగు ఉండదు. అందుకే... 'నీరు-నారు-నోరు' ఉంటే ఏ రాజ్యంలో ఉన్నా ఒక్కటే!' అంటుంటారు.

## బూడిద గుమ్మడి కాయ వడియాలు

**కావలసినవి:**
గుమ్మడి కాయ – 1 (పెద్దది), పొట్టు మినప్పప్పు – పావు కేజీ, పచ్చి మిర్చి – 100 గ్రా., జీలకర్ర – 50 గ్రా., ఇంగువ – టీ స్పూను, పసుపు – అర టీ స్పూను, ఉప్పు – తగినంత

**తయారీ:**
- మినప్పప్పును శుభ్రంగా కడిగి తగినన్ని నీళ్లు పోసి ముందు రోజు రాత్రి నానబెట్టాలి.
- బూడిద గుమ్మడికాయను శుభ్రంగా కడిగి చిన్న చిన్న ముక్కలుగా తరగాలి. (గింజలు తీసేయాలి)
- తరిగిన ముక్కలకు ఉప్పు, పసుపు, ఇంగువ జత చేసి ఒక వస్త్రంలో గట్టిగా మూట కట్టి, దాని మీద పెద్ద బరువు పెట్టి రాత్రంతా ఉంచాలి. (నీరంతా దిగిపోయి, ముక్కలు గట్టిపడతాయి)
- మరుసటి రోజు ఉదయం మినప్పప్పు పొట్టు తీసి, పచ్చి మిర్చి, ఉప్పు జత చేసి మెత్తగా రుబ్బాలి. (గారెల పిండిలా రుబ్బుకోవాలి)
- రుబ్బిన పిండికి బూడిద గుమ్మడికాయ ముక్కలు, జీలకర్ర జత చేయాలి.
- ప్లాస్టిక్ కాగితం మీద నిమ్మకాయ పరిమాణంలో వడియాలు పెట్టాలి.
- రెండు రోజుల ఎండిన తరవాత, వాటిని జాగ్రత్తగా తీసి, రెండవ వైపు తిరగేసి, మరో రెండు రోజులు ఎండనివ్వాలి.
- గాలి చొరని డబ్బాలో నిల్వ చేసుకోవాలి.
- నూనెలో వేయించుకుని, మామిడికాయ పప్పులో నంచుకుని తింటే రుచిగా ఉంటాయి.



లావణ్యా త్రిపాఠి, హెబ్బా పటేల్
– కవర్ ఫొటో: శివ మల్లాల

# ఎండ రుచులు

రుచికి ఆరంభం, అంతం ఉండవు.
సూర్యోదయానికీ, సూర్యాస్తమయానికీ
అంతం ఉండనట్లే!
పగళ్లు రోళ్లు పగిలే ఎండ ఉంటే,
ఆ రోట్లో నుంచి కూడా ఏదో రుచి బయటపడాలి కదా!
నూరి మరీ ఎండబెట్టే వడియాలు, అప్పడాలు,
ఒరుగులు, ఎండు ఊరగాయల రుచులకు కూడా
అంతం ఉండదు. ప్రతి ఎండాకాలం ఈ రుచులకు
ఒక ఆరంభం. మీరూ ఈ ఎండ రుచులను
మీ ఇంటిల్లిపాదికీ... వీలైతే మీ వీధిల్లిపాదికీ...
పంచుతారని నమ్ముతూ...

ఎక్కువకాలం నిల్వ ఉంచుకోవడం కోసం పండ్లు, కూరగాయలు, దుంపలు, చేపలు, మాంసం మొదలైన వాటిని ఎండబెట్టే ప్రక్రియ క్రీస్తుపూర్వం 12 వేల ఏళ్ల నాటి నుంచే వాడుకలో ఉంది. మంచు ప్రాంతాలను మినహాయిస్తే, ఎండలు దండిగా ఉండే ప్రాంతాల్లో వెలసిన అన్ని నాగరికతల్లోనూ ఆహార పదార్థాలను ఎండబెట్టే ప్రక్రియ వాడుకలో ఉండేది.

ఎండబెట్టి నిల్వ చేసుకున్న పదార్థాలను వంటకాలలో వినియోగించడం కూడా క్రమంగా మొదలైంది. మెసపొటేమియా, సింధు లోయ నాగరికతలకు చెందిన ప్రజలు చేపలు, రొయ్యలు, పీతల వంటి వాటిపై రుచి కోసం ఉప్పు జల్లి ఎండబెట్టే వారు. పండ్ల ముక్కలను, కూరగాయల ముక్కలను కూడా ఇలాగే ఎండబెట్టేవారు. ఎండిన వాటిని తాటాకుల్లో చుట్టి భవిష్యత్ అవసరాల కోసం భద్రపరచుకునేవారు.

## రాగి పిండి వడియాలు



**కావలసినవి:**
**రాగి పిండి** – కప్పు, **నీళ్లు** – 5 కప్పులు
**కారం పొడి** – అర టీస్పూను
**ఉప్పు** – తగినంత
**ఇంగువ** – చిటికెడు
**పచ్చి మిర్చి** – 6 (మిక్సీలో వేసి మెత్తగా చేయాలి)
**అల్లం + వెల్లుల్లి ముద్ద** – అర టీస్పూను
**కొత్తిమీర** – చిన్న కట్ట (సన్నగా తరగాలి)

**తయారీ:** ● ఒక పాత్రలో రెండు కప్పుల నీళ్లు, రాగి పిండి వేసి బాగా కలిపి పక్కన ఉంచాలి ● మిగిలిన నీళ్లను మరిగించి ఉప్పు, కారం పొడి, ఇంగువ, పచ్చిమిర్చి ముద్ద, అల్లం + వెల్లుల్లి ముద్ద వేసి బాగా కలపాలి ● నీళ్లలో కలిపి ఉంచిన రాగి పిండి జత చేస్తూ ఆపకుండా కలుపుతూ ఉడికించి, దించేయాలి ● చల్లారాక, ప్లాస్టిక్ కాగితం మీద వడియాలు పెట్టుకోవాలి ● రెండు మూడు రోజులు ఎండిన తరువాత డబ్బాలోకి తీసుకుని నిల్వ చేసుకోవాలి ● నూనెలో వేయించుకుని అన్నంతో గాని, స్నాక్‌లాగ గాని తింటే రుచిగా ఉంటాయి.

## మరమరాల వడియాలు

**కావలసినవి:**
**మరమరాలు** – 3 కప్పులు, **సగ్గుబియ్యం** – గుప్పెడు
**బూడిద గుమ్మడికాయ ముక్కలు** – పావు కప్పు
**ఉప్పు** – తగినంత, **పచ్చి మిర్చి** – 3
**కొత్తిమీర** – చిన్న కట్ట (సన్నగా తరగాలి)
**జీలకర్ర** – టీస్పూను, **వంట సోడా** – అర టీస్పూను
**నిమ్మరసం** – టేబుల్ స్పూను

**తయారీ:** ● సగ్గుబియ్యాన్ని శుభ్రంగా కడిగి కప్పుడు నీళ్లు జత చేసి ఉడికించి చల్లార్చాలి ● మరమరాలను శుభ్రంగా కడిగి పెద్ద పాత్రలోకి తీసుకోవాలి ● బూడిద గుమ్మడికాయ ముక్కలను గట్టిగా పిండి నీరు తీసేయాలి ● ముక్కలకు ఉప్పు, పచ్చి మిర్చి ముద్ద, జీలకర్ర, కొత్తిమీర తరుగు జత చేసి బాగా కలపాలి ● నిమ్మరసం వేసి మరోమారు కలపాలి ● ఉడికించిన సగ్గుబియ్యం, కడిగి ఉంచుకున్న మరమరాలు జత చేసి అన్నీ కలిసేలా బాగా కలపాలి. (వడియాలు పెట్టే సమయంలో వంట సోడా కలపాలి. ముందుగా కలిపితే మరింత గుల్లగా అయిపోయి, వేయించుకున్నప్పుడు ఎక్కువ నూనెను పీల్చుతాయి) ● ప్లాస్టిక్ పేపర్ మీద వడియాలు పెట్టాలి (గుండ్రని మూత సహాయంతో పెడితే గుండ్రంగా వస్తాయి) ● సుమారు నాలుగు రోజులు బాగా ఎండబెట్టాక, గాలి చొరని డబ్బాలో నిల్వ చేసుకోవాలి ● వడియాలను వేయించుకుని, టొమాటో కెచప్‌తో స్నాక్‌లా తింటే కూడా బాగుంటాయి.



## దోసకాయ వడియాలు

**కావలసినవి:**
**అన్నం** – రెండు కప్పులు
**దోసకాయ గుజ్జు** – కప్పు (మెత్తగా ఉన్న దోసకాయల తొక్కు తీసి మిక్సీలో వేసి గుజ్జు చేయాలి)
**పచ్చి మిర్చి** – 10 (మిక్సీలో వేసి పేస్ట్ చేయాలి)
**జీలకర్ర** – టీస్పూను
**ధనియాల పొడి** – అర టీస్పూను
**కరివేపాకు** – చిన్న కట్ట (సన్నగా తరగాలి)
**ఉప్పు** – తగినంత



**తయారీ:** ● ఒక పాత్రలో అన్నం, దోసకాయ గుజ్జు, జీలకర్ర, కరివేపాకు తరుగు, ధనియాల పొడి, పచ్చి మిర్చి ముద్ద, ఉప్పు వేసి బాగా కలపాలి ● ప్లాస్టిక్ పేపర్ మీద వడియాలు పెట్టుకోవాలి ● నాలుగు రోజులు బాగా ఎండిన తరువాత గాలిచొరని డబ్బాలోకి తీసుకోవాలి ● నూనెలో వేయించుకుని, సాంబారు లేదా రసంతో కలిపి తింటే రుచిగా ఉంటాయి. అన్నంతో కూరకు బదులు ఈ వడియాలు నంచుకుని తిన్నా బాగుంటాయి.







## ఉల్లిపాయ వడియాలు

**కావలసినవి:** **ఉల్లి తరుగు** – అర కేజీ, **మినప్పప్పు** – 100 గ్రా., **పచ్చి మిర్చి** – 10, **కొత్తిమీర** – రెండు కట్టలు (చిన్నవి, సన్నగా తరగాలి), **ఉప్పు** – తగినంత, **జీలకర్ర** – టీ స్పూను

**తయారీ:** ● మినప్పప్పును శుభ్రంగా కడిగి తగినన్ని నీళ్లలో సుమారు నాలుగు గంటలసేపు నానబెట్టాక మెత్తగా రుబ్బి పక్కన ఉంచుకోవాలి ● ఒక పెద్ద పాత్రలో మినప్పిండి, కొత్తిమీర తరుగు, ఉల్లి తరుగు, పచ్చి మిర్చి, ఉప్పు, జీలకర్ర వేసి అన్నీ కలిసేవరకు బాగా కలపాలి ● ప్లాస్టిక్ పేపర్ మీద వడియాలు పెట్టి నాలుగు రోజులు బాగా ఎండిన తరువాత తీసి డబ్బాలో నిల్వ చేసుకోవాలి ● నూనెలో వేయించుకుని, మధ్యాహ్నం టీ తాగాక వీటిని తింటే రుచిగా ఉంటాయి.



అందరి అభిమాన చిరుతిండి అయిన ఆలూచిప్స్ గిన్నిస్‌బుక్‌లోనూ చోటు దక్కించుకున్నాయి. బ్రిటన్‌కు చెందిన 'కార్కర్ క్రిస్ప్స్' సంస్థ 2013లో అతిపెద్ద ఆలూచిప్స్ ప్యాకెట్‌ను తయారు చేసింది. దీని బరువు 1,141 కిలోలు. ప్రపంచంలోనే అతిపెద్ద ఆలూచిప్స్ ప్యాకెట్‌గా ఇది గిన్నిస్ రికార్డు సాధించింది.



## పేలపిండి వడియాలు

**కావలసినవి:** **పేలాలు** – 2 కప్పులు, **సగ్గుబియ్యం** – పావు కప్పు, **పచ్చి మిర్చి** – 6 (చిన్న చిన్న ముక్కలుగా కట్ చేయాలి), **వాము** – టేబుల్‌స్పూను, **ఉప్పు** – తగినంత

**తయారీ:** ● సగ్గుబియ్యాన్ని ఒకటిన్నర కప్పుల నీళ్లలో సుమారు రెండు గంటలసేపు నానబెట్టాక, సన్నని మంట మీద ఉడికించాలి (అడుగంటకుండా కలుపుతుండాలి). ● వాము జత చేసి బాగా కలిపి దించేయాలి. ● సగం పేలాలను ఒక పెద్ద పాత్రలోకి తీసుకుని, ఒకటిన్నర కప్పుల నీళ్లు జత చేయాలి. పేలాలు నీటిని పీల్చుకుంటూ పెద్దవిగా అవుతాయి. అప్పుడు మిగిలిన పేలాలు, కప్పుడు నీరు జత చేయాలి. ● పేలాలు నీటిని పీల్చుకున్న తరవాత బాగా కలిపి పదినిముషాలు పక్కన ఉంచాలి. ● పేలాల పిండికి పచ్చి మిర్చి ముక్కలు, ఉప్పు జత చేయాలి. ● ఉడికించిన సగ్గు బియ్యం జత చేసి అన్నీ కలిసి మెత్తగా అయ్యేవరకు కలపాలి. ● వడల మాదిరిగా చేతితో ఒత్తి ప్లాస్టిక్ కాగితం మీద పెట్టి, నాలుగైదు రోజులు ఎండనివ్వాలి. ● గాలిచొరని డబ్బాలో నిల్వ చేసుకోవాలి. ● నూనెలో వేయించుకోవాలి. ● అన్నంలోనే కాకుండా స్నాక్‌లా కూడా రుచిగా ఉంటాయి.

## టొమాటో వడియాలు

**కావలసినవి:** **టొమాటోలు** – పావు కేజీ
**అటుకులు** – ఒకటిన్నర కప్పులు
**నువ్వులు** – పావు కప్పు, **కారం పొడి** – ఒకటిన్నర టీ స్పూనులు, **ఉప్పు** – తగినంత, **జీలకర్ర** – టీస్పూను
**పచ్చిమిర్చి** – 3, **ఉల్లి తరుగు** – పావు కప్పు
**కొత్తిమీర తరుగు** – కొద్దిగా

**తయారీ:** ● నువ్వులను శుభ్రంగా కడిగి పక్కన ఉంచాలి ● టొమాటోలను శుభ్రంగా కడిగి, పచ్చిమిర్చి, జీలకర్ర, కొత్తిమీర, కారంపొడి జత చేసి మిక్సీలో వేసి మెత్తగా గుజ్జు చేసి, ఒక పాత్రలోకి తీసుకోవాలి ● నీటిలో శుభ్రం చేసిన అటుకులు, నువ్వులను జత చేసి మెత్తగా అయ్యే వరకు బాగా కలిపి పది నిమిషాలు పక్కన ఉంచాలి ● కొద్దికొద్దిగా పిండి తీసుకుని ప్లాస్టిక్ పేపర్ మీద వడియాలు పెట్టాలి ● బాగా ఎండిన తరవాత డబ్బాలోకి తీసుకోవాలి ● సాయంత్రం పిల్లలు స్కూలు నుంచి వచ్చేసమయానికి వీటిని వేయించి పెడితే మాట్లాడకుండా తినేస్తారు.



# తెలగపిండి వడియాలు

**(ఉరుపిండి వడియాలు)**

**కావలసినవి:**

తెలగ పిండి – అరకప్పు (సూపర్ మార్కెట్ లేదా నూనె గానుగలో దొరుకుతుంది)
పచ్చిమిర్చి – 3
ఉప్పు – తగినంత
వాము – 2 టీస్పూన్లు
వెల్లుల్లి రేకలు – 6
జీలకర్ర – అర టీస్పూను
నువ్వులు – 50 గ్రా.



**తయారీ:**

- తగినన్ని నీళ్లల్లో తెలగపిండిని సుమారు 8 గంటలు నాన బెట్టాలి.
- పచ్చి మిర్చి, ఉప్పు, వాము, వెల్లుల్లి... మిక్సీలో వేసి మెత్తగా చేయాలి.
- ఈ మిశ్రమాన్ని తెలగపిండికి జత చేసి, చపాతీ పిండిలా కలపాలి.
- చిన్నచిన్న ఉండలు తీసుకుని అరచేతితో వడియాల మాదిరి ఒత్తి, నువ్వులు అద్ది ఎండలో ఆరబెట్టాలి.
- ఒక్కరోజు ఎండితే చాలు.
- వీటిని వేయించవలసిన అవసరం లేదు.
- పెరుగన్నంలో కాని, మజ్జిగతో కాని తింటే రుచిగా ఉంటాయి.

గింజలు, పప్పులు నానబెట్టి, రుబ్బి వడియాలు తయారు చేసుకోవడం మన దేశంలో మామూలే. పాశ్చాత్య దేశాల్లో కూడా దాదాపు ఇలాంటి పద్ధతిలోనే ఒరుగులను తయారు చేసుకుంటారు. వివిధ రకాల బీన్స్‌ను నానబెట్టి, రుబ్బి వడియాల్లా ఎండబెట్టుకుని నిల్వ చేసుకుంటారు. వీటి తయారీలో బియ్యం కూడా ఉపయోగిస్తారు. వీటిని 'బీన్ చిప్స్'గా ప్యాకెట్లలో విక్రయిస్తారు.



# అటుకుల వడియాలు

**కావలసినవి:** అటుకులు – కప్పు, ఆనపకాయ తురుము – రెండు కప్పులు, జీల కర్ర – టీ స్పూను, ఇంగువ – టీ స్పూను, పచ్చిమిర్చి – 6, ఉప్పు – తగినంత

**తయారీ:** ● అటుకులను నీళ్లలో వేసి కడిగి వెంటనే తీసేయాలి ● ఒక పెద్ద పాత్రలో ఆనపకాయ తురుము, అటుకులు వేసి బాగా కలపాలి ● జీలకర్ర, ఇంగువ, పచ్చిమిర్చి , ఉప్పు... మిక్సీలో వేసి మెత్తగా చేసి, అటుకుల మిశ్రమంలో వేసి కలపాలి ● చిన్న చిన్న ఉండలు చేసి వడియాలు పెట్టాలి ● రెండు మూడు రోజులు ఎండిన తరువాత డబ్బాలోకి తీసుకోవాలి ● నూనెలో వేయించి అన్నంలో తింటే రుచిగా ఉంటాయి.



# రవ్వ వడియాలు

**కావలసినవి:** బొంబాయి రవ్వ – ఒక కప్పు, నీళ్లు – మూడు కప్పులు, పచ్చిమిర్చి – రెండు(మెత్తగా గ్రైండ్ చేయాలి), ఉప్పు–రుచికి తగినంత, జీలకర్ర – అర టీ స్పూన్

**తయారీ:** ముందుగా గిన్నెలో నీటిని మరిగించి అందులో పచ్చిమిర్చి పేస్టు, జీలకర్ర పొడి వేయాలి. ఇవి నీటిలో కలిసిన తర్వాత రవ్వను ఉండలు కట్టకుండా ఉప్మాకు వేసు కున్నట్లుగా జాగ్రత్తగా వేస్తూ కలిపి దించేయాలి. వేడి తగ్గిన తర్వాత పిండిని గరిటెతో చక్రాలు(జంతిక లు) చేసుకునే పాత్రలో వేసి పాలిథిన్ పేపర్ మీద చక్రాల ఆకారంలో వత్తాలి. ఎండిన తర్వాత జాగ్రత్తగా తీసి నిల్వ చేయాలి. నూనెలో వేయించేటప్పుడు ఒక్కొక్కటిగా జాగ్రత్తగా వేయిస్తే మధ్యలో విరగ కుండా చక్రాలుగా వస్తాయి.

# క్యాబేజీ వడియాలు



**కావలసినవి:** మినపప్పు – ఒక కప్పు, తరిగిన క్యాబేజీ – ఒక కప్పు, ఉప్పు –రుచికి తగినంత
పచ్చిమిర్చి – నాలుగు, ఇంగువ (పొడి)– అర టీస్పూన్, జీలకర్ర – ఒక టీస్పూన్

**తయారీ:** క్యాబేజీ వడియాలకు ఉల్లిపాయ వడియాలకు పిండి సిద్ధం చేసినట్లే చేయాలి. ఉల్లిపాయ ముక్కలకు బదులుగా క్యాబేజీ తురుము కలుపుకోవాలి.

**గమనిక:**

వడియాలకు మినప్పప్పును గ్రైండర్‌లో కాని రోట్లో కాని రుబ్బాలి. మిక్సీలో గ్రైండ్ చేసి పెట్టిన వడియాలు వేయించిన వెంటనే బాగుంటాయి కాని చల్లారే కొద్దీ గట్టిపడతాయి, రుచి కూడా తగ్గుతుంది.

పిండితో చేసే వడియాలు రంగు రంగులుగా కావాలనుకుంటే పిండి ఉడికించి దించిన తర్వాత చిటికెడు ఫుడ్ కలర్ కలపాలి.





దాదాపు అన్ని దేశాల్లోనూ ఆలూ చిప్స్ ఫేమస్ అయితే, ఆఫ్రికన్ దేశాల్లో మాత్రం ఎక్కువగా పెండలం దుంపల చిప్స్ తింటారు. శతాబ్దాల కిందటి నుంచే పెండలం దుంపలతో ఒరుగులను తయారు చేసుకోవడం ఆఫ్రికా వాసులకు అలవాటే.



## సగ్గుబియ్యం వడియాలు

**కావలసినవి:**
**సగ్గుబియ్యం** – ఒక కప్పు
**నీళ్లు** – ఆరు కప్పులు
**పచ్చిమిర్చి** – రెండు
**ఉప్పు** –రుచికి తగినంత
**జీలకర్ర** – అర టీస్పూన్

**తయారీ:** ఒక గిన్నెలో నీరు పోసి మరిగే టప్పుడు సగ్గుబియ్యం వేయాలి. పచ్చి మిర్చి, ఉప్పు గ్రైండ్ చేసి, జీలకర్రను పొడిచేసి పక్కన ఉంచాలి. సగ్గుబియ్యం ఉడికి నీరు చిక్కబడేటప్పుడు ముందుగా గ్రైండ్ చేసిన పచ్చిమిర్చి పేస్ట్, జీలకర్ర పొడి కలిపి దించేయాలి. వేడి తగ్గిన తర్వాత పాలి థిన్ పేపర్ మీద కాని కాటన్ క్లాత్ మీద కాని స్పూన్‌తో సగ్గుబియ్యం మిశ్రమాన్ని వడియాలుగా పెట్టాలి.

## మినప వడియాలు

**కావలసినవి:** మినప్పప్పు – ఒక కప్పు, **పచ్చిమిర్చి** – నాలుగు, **ఉప్పు** – ఒక స్పూన్, **ఇంగువ పొడి** – చిటికెడు

**తయారీ:** రాత్రి పూట మినప్పప్పును నానబెట్టాలి. ఉదయం ఆ పప్పులో ఉప్పు వేసి చిక్కగా మెత్తగా రుబ్బాలి. మినప్పప్పు మెత్తగా అయిన తర్వాత ఇంగువ కలుపుకొని పాలిథిన్ పేపర్ మీద వడియాలు పెట్టుకోవాలి. సాయంత్రం ఒలిచి భద్రపరుచుకోవాలి. ఇవి ఒకరోజే పూర్తిగా ఎండిపో వాలి. అందుకే ఎండబాగా ఉన్నప్పుడు వీటిని పెడితే మంచిది. బియ్యం, రవ్వ వంటి వడియాలను మొదటి రోజు పూర్తిగా ఎండకపోతే రెండవ రోజు కూడా ఎండబెట్టవచ్చు. మినప్పప్పుతో చేసే ఏ వడియాలైనా ఒకరోజుకే పూర్తిగా ఎండాలి. పక్కరోజు ఎండాయంటే గట్టిగా అవుతాయి. నూనెలో వేయించినప్పుడు కరకరలాడకుండా పుటుక్కుమంటూ విరుగుతాయి, రుచిగా అనిపించవు.



## పొట్టు వడియాలు

**కావలసినవి: పొట్టు** – పావు కేజీ (పొట్టు మినప్పప్పు కడిగినప్పుడు వచ్చిన పొట్టుతో ఈ వడియాలు తయారుచేసుకోవాలి), **పచ్చిమిర్చి** – 10, **ఉప్పు** – తగినంత
**జీలకర్ర** – టీస్పూను, **ఉల్లి తరుగు** – పావు కప్పు
**తయారీ:**
● పొట్టు, పచ్చిమిర్చి, జీలకర్ర, ఉప్పు మిక్సీలో వేసి మెత్తగా గ్రైండ్ చేసి ఒక పాత్రలోకి తీసుకోవాలి ● ఉల్లి తరుగు జత చేసి మారో మారు కలపాలి ● కొద్ది కొద్దిగా తీసుకుని ప్లాస్టిక్ పేపర్ మీద వడియాలు పెట్టుకోవాలి ● నాలుగు రోజులు బాగా ఎండిన తరవాత గాలిచొరని డబ్బాలో నిల్వ చేసుకోవాలి ● కావలసినప్పుడు నూనెలో వేయించుకోవాలి ● పులుసు, చారు వంటి వాటిలో నంజుకుంటే రుచిగా ఉంటాయి.



## బియ్యప్పిండి వడియాలు

**కావలసినవి:** బియ్యప్పిండి –ఒక కప్పు, నీళ్లు – ఆరు కప్పులు, పచ్చిమిర్చి – రెండు, ఉప్పు – రుచికి తగినంత, జీలకర్ర –అర టీ స్పూన్, ఫుడ్‌కలర్ – చిటికెడు

**తయారీ:** బియ్యప్పిండిని ఒక కప్పు నీటితో కలిపి ఉంచాలి. జీలకర్రను పొడి చేయాలి. పచ్చిమిర్చిలో ఉప్పు కలిపి గ్రైండ్ చేయాలి. గిన్నెలో ఐదు కప్పుల నీటిని పోసి మరిగేట ప్పుడు మిర్చి పేస్టు వేసి బాగా కలిసిన తర్వాత విడిగా కలిపి ఉంచిన బియ్యప్పిండి వేస్తూ ఉండలు కట్టకుండా కలపాలి. పిండి ఉడికి మిశ్రమం చిక్కబడేటప్పుడు ఫుడ్ కలర్, జీలకర్రపొడి వేసి కలిపి దించేయాలి. వేడి తగ్గిన తర్వాత వడియాలు పెట్టుకోవడమే. వీటిని ఎండిన తర్వాత ఒలిచి గాలి, తడి తగలకుండా డబ్బాలో భద్రపరుచుకుంటే ఏడాది వరకు వాడుకోవచ్చు. ఫుడ్ కలర్ తప్పనిసరి కాదు. ఆకర్షణీయంగా కనిపించడానికి మాత్రమే వాడతారు.

## పెసర అప్పడాలు

**కావలసినవి:** పెసర పిండి – పావు కేజీ (పెసర పప్పును పొడి పిండిలా మర పట్టించాలి), నూనె – అర కేజీ, బియ్యప్పిండి – 50 గ్రా., కారం పొడి – 2 టీ స్పూన్లు, ఉప్పు – తగినంత, మెంతి పొడి – పావు టీ స్పూను

**తయారీ:** ● ముందుగా ఇంగువను కొద్ది పాటి నీళ్లలో నానబెట్టాలి ● పెద్ద గిన్నెలో పెసర పిండి, కారం, ఉప్పు, మెంతి పొడి, ఇంగువ చేర్చిన నీళ్లు వేసి గట్టిగా కలిపి ఒక రాత్రంతా ఉంచేయాలి ● మరుసటి రోజు ఈ పిండి ముద్దను కొద్దికొద్దిగా తీసుకుంటూ, నూనె జత చేస్తూ రోట్లో దంచాలి ● చిన్న చిన్న ఉండలు చేసుకుని, బియ్యప్పిండిలో అద్దుతూ ఒత్తుకోవాలి. ఎండలో ఆరబెట్టాలి ● డబ్బాలో నిల్వ చేసుకోవాలి. కావలసినప్పుడు వేయించుకుని అన్నంలో గాని, స్నాక్స్‌లా గాని తినవచ్చు.



## కారం అప్పడాలు

**కావలసినవి:** మినప్పప్పు – కప్పు (మెత్తగా పొడి పిండి పట్టించాలి), కారం పొడి – టీ స్పూను (సీమ మిరపకాయ కారం శ్రేష్ఠం), ఉప్పు – తగినంత, నూనె – టేబుల్ స్పూను, బియ్యప్పిండి – అద్దడానికి తగినంత, ఇంగువ – పావు టీ స్పూను

**తయారీ:** ● ఒక పాత్రలో మినప్పిండి, కారం పొడి, ఇంగువ, ఉప్పు వేసి బాగా కలపాలి ● తగినన్ని నీళ్లు జత చేస్తూ గట్టిగా పిండి కలుపుకోవాలి ● కొద్ది కొద్దిగా నూనె జత చేస్తూ కలిపిన పిండి బాగా మెత్తగా అయ్యేవరకు దంచుకోవాలి ● పాత్ర మీద వస్త్రం ఉంచి రెండు గంటలపాటు నానబెట్టాలి ● పిండిని చిన్న చిన్న ఉండలుగా చేయాలి ● కొద్దికొద్దిగా బియ్యప్పిండి అద్దుతూ ఒక్కో ఉండను ఒత్తుకోవాలి ● కొద్దిపాటి ఎండలో ఆరబెట్టాలి ● గాలిచొరని డబ్బాలో నిల్వ చేసుకోవాలి ● వేయించుకుని తినవచ్చు, నిప్పుల మీద కాల్చుకుని తినవచ్చు, మైక్రోవేవ్ ఓవెన్‌లో నూనె లేకుండా కూడా కాల్చుకుని తినవచ్చు



## ఆవిరి అప్పడాలు

**కావలసినవి:** బియ్యం – గ్లాసు, ఉప్పు – తగినంత, జీలకర్ర – 2 టీ స్పూన్లు, పచ్చిమిర్చి – 12, ఎండు కొబ్బరి పొడి – అర కప్పు

**తయారీ:** ● ముందుగా బియ్యాన్ని శుభ్రంగా కడిగి గంటసేపు నానబెట్టాలి ● నీరు వడగట్టి, బియ్యాన్ని మిక్సీలో వేసి దోసె పిండి మాదిరిగా రుబ్బుకుని, ఎండు కొబ్బరిపొడి జతచేసి బాగా కలపాలి. ● చిన్న పాత్రలో సగభాగం వరకు నీళ్లు పోసి పొయ్యి మీద పెట్టి నీళ్లను మరిగించాలి ● మరుగుతున్న నీటి పాత్రపై మూత పెట్టి, దాని మీద ముందుగా రుబ్బి ఉంచుకున్న పిండి ముద్దను కొద్దిగా మందంగా చిన్న అట్టులా వేయాలి. ఆవిరికి అవి పైకి లేస్తాయి ● అన్నీ ఇలా చేసుకున్న తరువాత వాటిని ఎండలో ఆరబెట్టాలి ● రెండు మూడు రోజులు బాగా ఎండిన తరవాత డబ్బాలో నిల్వ చేసుకోవాలి. నూనెలో వేయించుకుని తినాలి.

## మినప అప్పడాలు

**కావలసినవి:** మినప్పప్పు – అర కేజీ (పిండి మరలో పొడి పిండి పట్టించాలి), జీలకర్ర – టీ స్పూను, వాము – అర టీ స్పూను, వంట సోడా – పావు టీ స్పూను, నూనె – 4 టేబుల్ స్పూన్లు, ఉప్పు – తగినంత

**తయారీ:** ● పెద్ద పాత్రలో మినప్పిండి, జీలకర్ర, వాము, వంట సోడా, ఉప్పు వేసి బాగా కలపాలి ● కొద్ది కొద్దిగా నీళ్లు జత చేస్తూ పిండిని గట్టిగా కలపాలి ● పొడి వస్త్రం కప్పి, రెండు గంటలు నానబెట్టాలి ● కొద్దికొద్దిగా నూనె జత చేస్తూ పిండిని రోట్లో వేసి రోకలితో గట్టిగా దంచాలి. చిన్న చిన్న ఉండలు చేసి పక్కన ఉంచాలి ● ఒక్కో ఉండను అప్పడాల కర్రతో మధ్యమధ్యలో బియ్యప్పిండి అద్దుతూ ఒత్తాలి ● కొద్దిసేపు ఎండబెట్టి గాలిచొరని డబ్బాలో నిల్వచేసుకోవాలి.

## బంగాళ దుంపల అప్పడాలు

**కావలసినవి:** బంగాళ దుంపలు – అర కేజీ, కొత్తిమీర – చిన్న కట్ట (సన్నగా తరగాలి), నూనె – 2 టేబుల్ స్పూన్లు, ఇంగువ – కొద్దిగా, ఉప్పు + కారం పొడి – తగినంత, జీలకర్ర – టీ స్పూను, చేతికి రాసుకోవడానికి తగినంత నూనె

**తయారీ:** ● బంగాళ దుంపలను ఉడికించి తొక్క తీసి మెత్తగా మెదపాలి ● ఉప్పు, కారం పొడి, కొత్తిమీర తరుగు, ఇంగువ, జీలకర్ర జత చేసి బాగా కలపాలి. నూనె జత చేస్తూ మరోమారు బాగా కలపాలి. చిన్న చిన్న ఉండలు చేయాలి ● ఒక్కో ఉండను ఒక ప్లాస్టిక్ షీట్ మీద ఉంచి, పైన మరో షీట్ ఉంచి నెమ్మదిగా అప్పడాల కర్రతో ఒత్తాలి ● పైన ప్లాస్టిక్ షీట్ తీసి నాలుగైదు గంటలు నీడలో ఆరనివ్వాలి ● ప్లాస్టిక్ షీట్ మీద నుంచి తీసి నాలుగు రోజులు ఎండ బెట్టి, గాలి చొరని డబ్బాలో నిల్వ చేసుకోవాలి ● నూనెలో వేయించుకుని... అన్నంలో కాని స్నాక్స్‌లా కాని తినవచ్చు.





## పచ్చి మిర్చి అప్పడాలు

**కావలసినవి:** మినప్పిండి – కప్పు, పెసర పిండి – కప్పు, జీలకర్ర – టీ స్పూను, పచ్చి మిర్చి – 10 (మిక్సీలో వేసి మెత్తగా చేయాలి), ఇంగువ – టీ స్పూను, ఉప్పు – తగినంత, నూనె – పావు కేజీ, బియ్యప్పిండి – అద్దడానికి తగినంత

**తయారీ:** ● ఒక పెద్ద పాత్రలో మినప్పిండి, పెసర పిండి, జీలకర్ర, పచ్చిమిర్చి ముద్ద, ఇంగువ, ఉప్పు వేసి బాగా కలపాలి ● కొద్దికొద్దిగా నీళ్లు జత చేస్తూ పిండి గట్టిగా కలుపుకోవాలి ● వస్త్రం మూత పెట్టి రెండు మూడు గంటలు నాననివ్వాలి ● తగినంత నూనె జత చేస్తూ పిండి దంచుకోవాలి ● చిన్న చిన్న ఉండలు చేసుకోవాలి ● బియ్యప్పిండి అద్దుతూ, అప్పడాల కర్రతో పల్చగా ఒత్తుకోవాలి ● రెండు మూడు గంటలు ఆరిన తరువాత డబ్బాలో నిల్వ చేసుకోవాలి ● నూనెలో వేయించుకుని తినాలి.

## చిలగడ దుంప అప్పడాలు

**కావలసినవి:** చిలగడ దుంపలు – అర కేజీ, కారం పొడి – అర టీ స్పూను, జీలకర్ర – అర టీ స్పూను, ఇంగువ – పావు టీ స్పూను, వంట నూనె – 2 టీ స్పూన్లు, ఉప్పు – తగినంత

**తయారీ:** ● చిలగడ దుంపలను శుభ్రంగా కడిగి, తగినన్ని నీళ్లు, ఉప్పు జత చేసి కుకర్‌లో ఉడికించాలి ● ఉడికిన దుంపలు చల్లారాక తొక్క తీసి, రెండు భాగాలుగా చేసుకోవాలి ● ఒక భాగంలో కారం పొడి, జీలకర్ర, ఇంగువ వేసి బాగా మెత్తగా అయ్యేలా మెదపాలి ● కారం కలిపిన చిలగడ దుంపలను మెత్తగా చిదమాలి.



● మిగిలిన సగ భాగం కూడా మెత్తగా మెదపాలి ● రెండింటినీ బాగా కలిపి చిన్న చిన్న ఉండలు చేసుకోవాలి ● ఒక ప్లాస్టిక్ పేపర్ మీద కొద్దిగా నూనె రాసి ఒక ఉండను పేపర్ మీద ఉంచి ఆ ఉండ మీద మరో ప్లాస్టిక్ షీట్ ఉంచి, చేతితో నెమ్మదిగా అప్పడం ఆకారం వచ్చేవరకు ఒత్తాలి ● పైన ఉన్న ప్లాస్టిక్ కవర్ తీసి కింద ఉన్న ప్లాస్టిక్ కవర్‌తో అప్పడాన్ని నాలుగైదు గంటలు ఆరనివ్వాలి ● నెమ్మదిగా అప్పడాలను విడదీసి నాలుగైదు రోజులు ఎండ బెట్టాలి. గాలి చొరని డబ్బాలో నిల్వ చేసుకోవాలి ● నూనెలో వేయించి, అన్నంలో కాని స్నాక్స్‌లా కాని తింటే రుచిగా ఉంటాయి.

## మెంతి అప్పడాలు

(మెంతికూర బదులు పాలకూర, తోటకూర, పుదీనా, కొత్తిమీర, కరివేపాకు... వేటితోనైనా చేసుకోవచ్చు)

**కావలసినవి:** మెంతి కూర – మూడు కట్టలు, పెసర పిండి – అర కేజీ, బియ్యప్పిండి – 100 గ్రా., ఇంగువ – టీ స్పూను, జీలకర్ర – 2 టీ స్పూన్లు, సీమ మిరపకాయలు – 50 గ్రా. (ఎండబెట్టి మెత్తగా పొడి చేయాలి. ఇవి కారంగా ఉంటాయి. అందువల్ల తక్కువ కారం వాడితే సరిపోతుంది), ఉప్పు – తగినంత, నూనె – పావు కిలో కంటె కొద్దిగా ఎక్కువ

**తయారీ:** ● మెంతి కూర ఆకులను శుభ్రంగా కడిగి కొద్దిగా వడిలే వరకు ఎండబెట్టాలి ● ఒక పెద్ద పాత్రలో పెసర పిండి, బియ్యప్పిండి, జీలకర్ర, ఉప్పు, కారం, ఇంగువ, ఎండిన మెంతి కూర వేసి బాగా కలపాలి ● కొద్ది కొద్దిగా నీళ్లు జత చేస్తూ పిండిని గట్టిగా కలపాలి. నాలుగైదు గంటలు నాననివ్వాలి ● చిన్న చిన్న ఉండలు చేయాలి ● బియ్యప్పిండి అద్దుతూ ఒక్కో ఉండను పల్చగా ఒత్తాలి ● రెండు మూడు గంటలు ఆరబెట్టాలి. గాలి చొరని డబ్బాలో నిల్వ చేసుకోవాలి ● నూనెలో వేయించుకుని స్నాక్స్‌లా తినవచ్చు

## వెల్లుల్లి అప్పడాలు

**కావలసినవి:** మినప్పిండి – కప్పు, పుట్నాల పిండి – టేబుల్ స్పూను, బియ్యప్పిండి – టేబుల్ స్పూను, జీలకర్ర పొడి – అర టీ స్పూను, వెల్లుల్లి రేకలు – 10, అల్లం – చిన్న ముక్క, ఇంగువ – టీ స్పూను, పచ్చి మిర్చి – 8, పల్లీల పొడి – టేబుల్ స్పూను, ఉప్పు – తగినంత, నూనె – పావు కేజీ

**తయారీ:** ● మిక్సీలో వెల్లుల్లి రేకలు, పచ్చి మిర్చి, అల్లం వేసి మెత్తగా చేయాలి ● ఒక పాత్రలో మినప్పిండి, పుట్నాల పిండి, పల్లీల పొడి, జీలకర్ర పొడి, ఉప్పు వేసి బాగా కలపాలి ● వెల్లుల్లి మిశ్రమం జత చేయాలి ● కొద్ది కొద్దిగా నీళ్లు జత చేస్తూ పిండి గట్టిగా కలుపుకోవాలి ● సుమారు రెండు మూడు గంటలు నానబెట్టాలి ● నూనె జత చేస్తూ పిండిని బాగా దంచాలి. ● చిన్న చిన్న ఉండలు చేయాలి ● బియ్యప్పిండి అద్దుతూ పల్చగా ఒత్తాలి ● రెండు మూడు గంటలు ఆరిన తర్వాత డబ్బాలో నిల్వ చేసుకోవాలి ● వేయించుకుని తినాలి.

## నువ్వుల అప్పడాలు

**కావలసినవి:** మినప్పిండి – అర కేజీ, నువ్వులు – 100 గ్రా., ఇంగువ – టీ స్పూను, ఉప్పు – తగినంత, బియ్యప్పిండి – అద్దడానికి తగినంత, నూనె – అర కేజీ

**తయారీ:** ● ఒక పాత్రలో మినప్పిండి, ఉప్పు, ఇంగువ వేసి కలపాలి. తగినన్ని నీళ్లు జత చేస్తూ చపాతీ పిండిలా కలుపుకుని రెండు గంటలు నాననివ్వాలి ● నూనె జత చేస్తూ పిండిని రోట్లో వేసి దంచాలి. చిన్న చిన్న ఉండలు చేయాలి ● ఒక్కో ఉండకు నువ్వులు అద్దాలి ● బియ్యప్పిండి అద్దుతూ పల్చగా ఒత్తాలి ● రెండు మూడు గంటలసేపు ఆరిన తర్వాత గాలి చొరని డబ్బాలో నిల్వ చేసుకోవాలి. నూనెలో వేయించి అన్నంలో తింటే రుచిగా ఉంటాయి.





## మామిడికాయ ఒరుగులు

**కావలసినవి:** మామిడి కాయలు – 10, ఉప్పు – తగినంత, పసుపు – టేబుల్ స్పూను

**తయారీ:** ● మామిడి కాయల తొక్క తీసి సన్నగా పొడవుగా ముక్కలు తరగాలి. టెంకలు వేరు చేయాలి ● ఒక పెద్ద వస్త్రం మీద మామిడి కాయ ముక్కలు, టెంకలు, ఉప్పు, పసుపు వేసి బాగా కలిపి సుమారు వారం రోజులు ఎండబెట్టాలి ● ముక్క పట్టుకుంటే విరిగేలా ఉండాలి ● ఈ ఒరుగులను డబ్బాలో నిల్వ చేసుకోవాలి ● ఇష్టం ఉన్నవారు వీటిని అలాగే తినేయచ్చు ● ఏడాది పొడుగునా మామిడికాయ పప్పు కావాలనుకునేవారు, ఈ ఒరుగులతో పప్పు తయారు చేసుకోవచ్చు.

(మామిడికాయ పప్పు చేసే విధానంలోనే, మామిడికాయ ముక్కల బదులు, మామిడికాయ ఒరుగులు వాడాలి)



## దొండ ఒరుగులు

**కావలసినవి:** దొండ కాయలు – కేజీ, ఉప్పు – తగినంత, ధనియాల పొడి – టేబుల్ స్పూను

**తయారీ:** ● దొండకాయలను శుభ్రంగా కడిగి తడిపోయే వరకు ఆరబెట్టాలి ● సన్నగా చక్రాల్లా తరిగి, ఉప్పు, ధనియాల పొడి జత చేసి బాగా కలిపి, అర గంట తరువాత దొండకాయ చక్రాలను గట్టిగా పిండి నీరు వేరు చేయాలి ● పల్చటి వస్త్రం మీద కాని ప్లాస్టిక్ కాగితం మీద కాని ఈ చక్రాలను మూడు నాలుగు రోజులు ఎండబెట్టాలి ● పూర్తిగా ఎండిన తరువాత డబ్బాలో నిల్వ చేసుకోవాలి ● తినాలనుకున్నప్పుడు నూనెలో వేయించుకోవాలి ● ఒరుగులు వేడిగా ఉండగానే కొద్దిగా ఉప్పు, కారం, ధనియాల పొడి చల్లాలి ● ఆనపకాయ కూర వంటి చప్పగా ఉండే కూరలలో వీటిని నంజుకుని తింటే రుచిగా ఉంటాయి.



బంగాళ దుంపల చిప్స్ సృష్టి వెనుక ఒక ఆసక్తికరమైన కథ ఉంది. 19వ శతాబ్దిలో అమెరికాలోని మూన్ లేక్ హౌస్ రెస్టారెంట్‌కు వచ్చిన ఓ కస్టమర్ బంగాళదుంపల ముక్కలను కరకరలాడేలా వేయించి తెమ్మని ఆర్డర్ చేశాడట. అక్కడ షెఫ్‌గా పనిచేసే జార్జి క్రమ్ అలాగే తెచ్చాడు. ముక్కలు కొంచెం మెత్తగా ఉండటంతో ఇంకా పలచగా తరిగి వేయించ మన్నాడట కస్టమర్. రెండు మూడుసార్లు ఇదే తంతు జరగడంతో జార్జి క్రమ్‌కు విసుగు పుట్టి బంగాళ దుంపలను అతి పలచగా తరిగి పారేసి, వాటిని వేయించి కస్టమర్‌కు వడ్డించాడు. వాటిని నోట్లో వేసుకోగానే కరకర లాడుతూ కరిగిపోవడంతో కస్టమర్ ఖుష్ హువా! ఆలూ చిప్స్ సూపర్ హిట్ హువా!

## దోస ఒరుగులు

**కావలసినవి:** బుడమ దోసకాయలు – కేజీ (చిన్నగా చూడటానికి దొండకాయల మాదిరిగా ఉంటాయి), ఉప్పు – తగినంత

**తయారీ:** ● దోసకాయలను శుభ్రంగా కడిగి, చక్రాల్లా తరగాలి ● ఉప్పు జత చేసి అరగంట సేపు పక్కన ఉంచాలి ● నీరు పోయేంతవరకు గట్టిగా పిండి చక్రాలను రెండు మూడు రోజులు ఎండబెట్టాలి ● నూనెలో వేయించి, పళ్లెంలోకి తీసుకోవాలి ● ఒరుగులు వేడిగా ఉండగానే ఉప్పు, కారం, ధనియాల పొడి చల్లాలి. మధ్యాహ్నం వేళ వీటిని స్నాక్స్‌లాగ తింటే బాగుంటాయి.



## ఉసిరి ఒరుగులు

**కావలసినవి:** ఉసిరి కాయలు – కేజీ (పెద్దవి), పసుపు – టీ స్పూను, మెంతి పొడి – పావు టీ స్పూను, ధనియాల పొడి – అర టీ స్పూను, ఉప్పు – తగినంత

**తయారీ:** ● ఉసిరి కాయలను పెద్ద పెద్ద ముక్కలుగా తరగాలి (గింజ వేరుచేయాలి) ● ఒక పాత్రలో ఉసిరి ముక్కలు, పసుపు, ఉప్పు, మెంతి పొడి, ధనియాల పొడి వేసి బాగా కలిపి సుమారు రెండు గంటల సేపు ఊరిన తరువాత, ముక్కలను ఎండలో రెండు మూడు రోజులు ఆరబెట్టాలి ● గాలి చొరని డబ్బాలో నిల్వ చేసుకోవాలి ● ప్రతిరోజూ ఉదయం రెండు ఒరుగులు తింటే, అనారోగ్యాలు ఆమడ దూరం పరుగులు తీస్తాయని ఆయుర్వేదం చెబుతోంది.



# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## 'ఆంకిలోసింగ్ స్పాండిలైటిస్' సమస్యకు సరైన వైద్యం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



మన శరీరంలో సహజంగా ఏర్పాటై ఉన్న రక్షణ వ్యవస్థ, సూక్ష్మక్రిములు మరియు జబ్బుల నుండి మనల్ని నిత్యం కాపాడుతుంటుంది. ఇటువంటి అద్భుతమైన రక్షణ వ్యవస్థ ఒక్కోసారి పొరబడి ఏకంగా మన శరీర భాగాల మీద దాడి చేస్తుంది. దీని ఫలితమే రకరకాల ఆటోఇమ్యూన్ సమస్యలు. ఈ కోవకు చెందినదే 'ఆంకిలోసింగ్ స్పాండిలైటిస్'. సాధారణంగా వెన్ను సమస్యలు - వెన్నుపూసలు అరిగిపోవడం మరియు వాటి మధ్యలో ఉండే డిస్కులు దెబ్బతినటం వలన సంభవిస్తాయి. కానీ ఈ సమస్య మాత్రం వెన్ను దగ్గరలోని కణజాలంపై మనలోని రోగనిరోధక వ్యవస్థ స్వయంగా దాడి చేయడం వలన సంభవిస్తుంది. ముఖ్యంగా ఇన్‌ఫ్లమేషన్ ప్రభావంతో వెన్నెముక బిరుసుగా మారడాన్ని 'ఆంకిలోసింగ్ స్పాండిలైటిస్' అని అంటారు.

ఈ సమస్య సాధారణంగా 15 నుండి 25 సం॥ల మధ్య వయస్సు వారిలో కనబడుతుంది. అందులోనూ స్త్రీల కంటే పురుషులలో 3 రెట్లు దీనిని ఎక్కువగా చూడవచ్చు. సహజంగా వెన్నెముక నిర్మాణం చాలా సంక్లిష్టమైనది. డిస్కులు, కండరములు, లిగమెంట్లు, టెండాన్‌లు మరియు కార్టిలేజ్‌ల సముదాయంతో వెన్నెముక ఏర్పడుతుంది. మనిషి వంగడానికి మరియు ఇతర కదలికలకు ఇది తోడ్పడుతుంది. 'ఆంకిలోసింగ్ స్పాండిలైటిస్' అనేది ఆర్థరైటిస్ గ్రూప్‌కు చెందిన వ్యాధి. దీనిని 'సీరోనెగటివ్ స్పాండైలో ఆర్థరైటిస్' అని అంటారు. ఎప్పుడైతే వెన్నెముక దగ్గర కణజాలం 'ఫైబ్రోసిస్'కు గురి కాబడుతుందో లేదా వెన్నుపూసలు ఒకదానికొకటి కలసిపోవడం జరుగుతుందో అప్పుడు వెన్నెముక తన సహజ కదలికలు కోల్పోయి, ఒక గట్టి వెదురు కర్ర మాదిరిగా తయారవుతుంది. ఇటువంటి పరిస్థితినే వైద్యపరిభాషలో 'బ్యాంబూస్పైన్' అని అంటారు.




**కారణాలు:** ముఖ్యంగా జన్యుపరమైన కారణాల పరంగా - 'ఆంకిలోసింగ్ స్పాండిలైటిస్' బాధితులు 90% మేరకు $HLAB_{27}$ అనే జన్యువును కలిగి ఉంటారు. మరియు కుటుంబ చరిత్ర కూడా ఈ వ్యాధికి ఒక కారణం కావచ్చు.

**లక్షణాలు:** ఈ వ్యాధి యొక్క ప్రభావం ముఖ్యంగా నడుము, తుంటి కీళ్ళపై(Sacro-iliac Joint) ఉంటుంది. ఈ ప్రాంతంలో మరియు పిరుదులలో సాధారణం నుండి అతి తీవ్రమైన నొప్పి ఉండవచ్చు. • వెన్నెముకలోని వెన్నుపూసలు ఒకదానికొకటి కలసిపోవడం ద్వారా నడుము-తుంటి ప్రాంతము మరియు మెడ భాగము బిగువుగా మారి సాధారణ కదలికలకు ఆటంకం కలుగుతుంది. • 'ఆంకిలోసింగ్ స్పాండిలైటిస్' ప్రభావం కేవలం వెన్నెముకపై మాత్రమే కాకుండా కాళ్ళు, చేతులలోని కీళ్ళు, గుండె కవాటాలు, ఊపిరితిత్తులపై కూడా ఉంటుంది. • 40% మేరకు ఈ సమస్యతో బాధపడే వారిలో కంటికి సంబంధించిన దుష్ఫలితాలు మొదలవుతాయి. ముఖ్యంగా కళ్ళు ఎర్రగా మారడం మరియు కళ్ళ మంటలు, వెలుతురు చూడలేకపోవడం, కొన్ని సందర్భాలలో కంటిచూపు మందగించడం వంటి సమస్యలు తలెత్తుతాయి. వీటితోబాటుగా జ్వరం, నీరసం, ఆకలి మందగించడం వంటి లక్షణాలు కనిపిస్తాయి.



**నిర్ధారణ పరీక్షలు:** రోగి లక్షణాలను బట్టి మరియు CBP, ESR, సి రియాక్టివ్ ప్రోటీన్, {C.R.P.}, X-Ray, MRI-Spine, $HLAB_{27}$ మొదలగు టెస్ట్‌ల ద్వారా ఈ వ్యాధిని నిర్ధారించవచ్చు.

**దుష్ఫలితాలు:** వెన్నుపూసలు 'ఆస్టియోపోరోసిస్'కు గురి కావడం వలన వెన్నెముక ఫ్రాక్చర్లు సంభవిస్తాయి. • ఈ వ్యాధి తీవ్రంగా ఉన్నవారిలో వెన్నెముక నుండి వచ్చే నరాలు ఒత్తిడికి గురికావడం వలన, కాళ్ళు-చేతులలో తిమ్మిర్లు, సూదులు గుచ్చినట్లుగా ఉండటం, సత్తువ కోల్పోవడం వంటి లక్షణాలు స్పష్టంగా కనిపిస్తాయి. • ఈ సమస్య ఊపిరితిత్తులపై ప్రభావం చూపడం వలన శ్వాస తీసుకోవడంలో ఇబ్బందులు కలుగుతాయి. • నొప్పిని నివారించే మందులు ఎక్కువగా తీసుకోవడం వలన కిడ్నీ సమస్యలు తలెత్తుతాయి.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** 'ఆంకిలోసింగ్ స్పాండిలైటిస్' అనేది ఒక దీర్ఘకాలిక సమస్య. సమస్యాత్మకమైన ఈ వ్యాధిని ప్రాథమిక దశలోనే గుర్తించి - తక్షణ వైద్యం ద్వారా వెన్నెముక దెబ్బతినకుండా కాపాడుకునే వీలుంది. హోమియో మందులతో ఇది సమర్థవంతంగా నయం కాబడుతుంది. సూక్ష్మీకరణ పద్ధతిలో తయారైన మందులతో జరుపబడే జెనెటిక్ కాన్స్‌టిట్యూషనల్ చికిత్స మేరకు, కేవలం వ్యాధి లక్షణాలుగా చెప్పబడే - నొప్పి, తిమ్మిరి, మంటలను తగ్గించడమే కాకుండా, వ్యాధి మూలకారణాన్ని గుర్తించి చికిత్సను అందివ్వడం జరుగుతుంది. తద్వారా వ్యాధి తీవ్రతను తగ్గించి, వ్యాధిని పూర్తిగా నయం చేసే అవకాశం ఉంది లేదా వ్యాధి వలన కలిగే దుష్ఫలితాల బారిన పడకుండా కాపాడే అవకాశం ఉంటుంది.



## పైనాపిల్ ఒరుగులు

**కావలసినవి:** పైనాపిల్ – ఒకటి, పంచదార – రెండు టేబుల్ స్పూన్లు, దాల్చినచెక్క పొడి – ఒక టీస్పూన్

**తయారీ:** పైనాపిల్ చెక్కు తీసి బాగా పలచని ముక్కలుగా తరుక్కోవాలి. ముక్కలకు పంచదార, దాల్చినచెక్క పొడి పట్టించి ఒక పళ్లెంలో వేసి ఉంచాలి. అరగంట తర్వాత ఈ ముక్కలను బాగా ఎండ సోకే ప్రదేశంలో శుభ్రమైన వస్త్రంపై ఆరబెట్టుకోవాలి. పూర్తిగా ఎండిపోయిన తర్వాత గాలి చొరబడని డబ్బాలో భద్రపరచుకోవాలి. వీటిని నేరుగానే చిరుతిండిగా తినవచ్చు.







## వంగ ఒరుగులు

**కావలసినవి:** వంకాయలు – అరకిలో, చింతపండు రసం – పావుకప్పు, వెనిగర్ – పావుకప్పు, మిర్చిపొడి – రెండు టీస్పూన్లు, ఉప్పు – అర టీస్పూన్, పసుపు – అర టీస్పూన్

**తయారీ:** వంకాయల తొడిమలను తొలగించి పారేయాలి. ఉప్పునీట్లో వంకాయలను శుభ్రంగా కడిగి, పొడి వస్త్రంతో తడి ఆరిపోయేలా తుడవాలి. తర్వాత వంకాయలను పలచని ముక్కలుగా తరుక్కోవాలి. తరిగిన ముక్కలను చింతపండు రసం, వెనిగర్, మిర్చిపొడి, ఉప్పు, పసుపు కలిపిన మిశ్రమాన్ని పట్టించి వెడల్పాటి పళ్లెంలో పెట్టుకోవాలి. అరగంట సేపు అలాగే వదిలేయాలి. ఆ తర్వాత బాగా ఎండ సోకే ప్రదేశంలో శుభ్రమైన వస్త్రంపై ఆరబెట్టాలి. పూర్తిగా ఎండిపోయిన తర్వాత గాలి చొరబడని డబ్బాలో భద్రపరచుకోవాలి. వీటిని వేయించుకుని ఉప్పు, కారం చల్లుకుని తింటే రుచిగా ఉంటాయి.

## ఆపిల్ ఒరుగులు

**కావలసినవి:** ఆపిల్స్ – అరడజను, నిమ్మరసం – రెండు టేబుల్ స్పూన్లు, ఉప్పు – చిటికెడు

**తయారీ:** ముందుగా ఆపిల్స్‌ను శుభ్రంగా నీట్లో కడిగి, పొడి వస్త్రంతో తుడవాలి. తర్వాత వాటిని పలచగా గుండ్రంగా తరుక్కోవాలి. వాటి మధ్య విత్తనాలు ఉన్న భాగాన్ని తొలగించాలి. ఆపిల్ చిప్స్‌కు ఉప్పు కలిపిన నిమ్మరసాన్ని పట్టించాలి. ఆరుబయట బాగా ఎండకాసే చోట పొడి వస్త్రాన్ని పరిచి, దానిపై ఆపిల్ చిప్స్‌ను ఆరబెట్టుకోవాలి. పూర్తిగా ఎండిన తర్వాత వాటిని గాలి చొరబడని డబ్బాలో భద్రపరచుకోవాలి. ఆపిల్ చిప్స్‌ను వేయించుకుని, దాల్చిన పొడి చల్లుకుని తింటే రుచిగా ఉంటాయి.



## బీట్‌రూట్ ఒరుగులు

**కావలసినవి:** బీట్‌రూట్స్– నాలుగు, నిమ్మరసం – ఒక టేబుల్‌స్పూన్, ఉప్పు – తగినంత, మెంతాకు పొడి – ఒక టేబుల్‌స్పూన్, ఆవపొడి – ఒక టేబుల్‌స్పూన్

**తయారీ:** ముందుగా బీట్‌రూట్స్ తొక్క తీసేయాలి. పలచటి ముక్కలుగా తరుక్కోవాలి. నిమ్మరసంలో ఉప్పు, మెంతాకు పొడి, ఆవాల పొడి కలిపి ఈ మిశ్రమాన్ని బీట్‌రూట్ చిప్స్‌కు పట్టించాలి. వీటిని ఒక జల్లెడలాంటి ట్రేలో వేసుకుని, ఆ ట్రేను ఒక ఖాళీ పాత్రపై మూతలా పెట్టాలి. గంటసేపు అలాగే వదిలేయాలి. ఈలోగా పాత్రలోకి కొంత నీరు దిగుతుంది. బాగా ఎండ సోకే ప్రదేశంలో పొడి వస్త్రాన్ని పరిచి, దానిపై ఈ బీట్‌రూట్ చిప్స్‌ను ఆరబెట్టుకోవాలి. ఇవి పూర్తిగా ఎండిపోయిన తర్వాత గాలి చొరబడని డబ్బాలో భద్రపరచుకోవాలి. వీటిని వేయించుకుని చిరుతిండిగా తినడానికీ బాగుంటాయి, అన్నంలో నంజుకోవడానికీ బాగుంటాయి. క్యారట్ చిప్స్‌ను కూడా ఇదే పద్ధతిలో తయారు చేసుకోవచ్చు.







## పనస ఒరుగులు

**కావలసినవి:** పనస కాయ – 1, పసుపు – టేబుల్ స్పూను, ఉప్పు – తగినంత, నీళ్లు – 3 టేబుల్ స్పూన్లు, వెజిటబుల్ ఆయిల్ – డీప్ ఫ్రై చేయడానికి తగినంత

**తయారీ:** ● పనసకాయ తరిగే ముందు కత్తికి, చేతికి నూనె రాసుకోవాలి. లేదంటే చేతి నిండా జిగురు పట్టేసి, పనసకాయ తరగటం కష్టమవుతుంది ● పచ్చిగా ఉండే పనసకాయను మధ్యకు కట్ చేయాలి ● లోపల ఉండే పీచు పదార్థం, గింజలను వేరుచేశాక, పనసకాయను సన్నగా పొడవుగా ముక్కలు తరగాలి ● తరిగిన ముక్కలకు పసుపు, ఉప్పు, నీళ్లు జత చేసి బాగా కలపాలి ● సుమారు ఒక గంట సేపు ఎండబెట్టి తీసేయాలి ● మరోమారు పసుపు, ఉప్పు, నీళ్లు, నూనె జత చేసి బాగా కలపాలి ● బాణలిలో నూనె కాగాక వీటిని వేయించి తీసేయాలి. చల్లారాక గాలి చొరని డబ్బాలో నిల్వ చేసుకోవాలి ● ఇవి చాలా రోజులు నిలవ ఉంటాయి ● వీటిని స్నాక్స్‌లాగ తింటే రుచిగా ఉంటాయి.

## బెండకాయ ఒరుగులు

**కావలసినవి:** బెండకాయలు – కేజీ, ఉప్పు – తగినంత, ధనియాల పొడి – టేబుల్ స్పూను

**తయారీ:** ● బెండకాయలను శుభ్రంగా కడిగి ఆరబెట్టాలి ● గుండ్రంగా చక్రాల్లా తరగాలి ● ఉప్పు, ధనియాల పొడి జత చేసి బాగా కలిపి ఎండలో ఆరబెట్టాలి ● రెండు రోజులు ఎండిన తరవాత డబ్బాలో నిల్వ చేసుకోవాలి ● నూనెలో వేయించుకుని, ఉప్పు, కారం, ధనియాల పొడి చల్లాలి ● సాంబారు అన్నంతో తింటే రుచిగా ఉంటాయి.




వాస్తు విద్వాన్, సాయిశ్రీ
గౌ॥డా॥ దంతూరి పండరీనాథ్




వాస్తు వీక్షణం

## శల్యవేధ

గృహము యొక్క కట్టుబడి ప్రదేశము నందు గాని, ఆవరణయందుగాని భూమి లోపల శల్యములున్నట్లయితే 'శల్యవేధ' దోషము కలుగుతుంది. శల్యము అనగా క్షీణించుచున్నది అని అర్థం. **ఎముకలు, దంతములు, వెంట్రుకలు, గోర్లు, చర్మములు, క్షీణిస్తున్న లోహములు, బొగ్గులు మొదలైనవి.** భూమి యందు శల్యములున్నట్లయితే గృహ యజమానికి, అందు నివసిస్తున్నవారికి క్రమముగా, వరుసగా కష్టనష్టములు అను భవములోకి వస్తూ మృత్యువును కూడా పొందవలసి రావచ్చు. గృహము వాస్తు ప్రకారము శ్రేష్టమైనదిగా కనిపించినప్పటికీ పైన పేర్కొనబడిన చెడు ఫలితాలను ఆ గృహమున నివసించువారు అనుభవిస్తున్నట్లయితే... ఒక్కసారి ఆ ఇంటికి **'శల్యవేధ'** దోషము ఉన్నదేమోనని పరిశీలించుకోవాలి. దోషమున్నట్లయితే శల్యములను తీసివేయ టం వలన తిరిగి మంచి ఫలితాలను చాలా సులభముగా పొందవచ్చును. 'శల్యవేధ' ప్రమాణం ఒక మనిషి సాధారణ ఎత్తుగా చెప్పబడినది. అంటే **భూమి పై భాగము నుండి మనిషి ఎత్తు (8అడుగులు X 12 అంగుళాలు = 96 అంగుళాలు)** వరకు **శల్యములు ఉండకూడదు.** అంతకంటే క్రిందకి శల్యములు ఉంటే అది దోషము కాదు. గృహ నిర్మాణమునకు క్షేత్రమును ఎన్నుకొనునప్పుడే శల్యములు లేవని నిర్ధారించుకోవటం మంచిది. బయట నుండి మట్టిని తెచ్చి గృహనిర్మాణ క్షేత్రము నందు నింపవలసి వస్తే ఆ మట్టి యందు శల్యములు లేకుండా ముందే జాగ్రత్త పడటము మంచిది.

అలా కానప్పుడు ఆ క్షేత్రమునందు గాని, ఆ మట్టి యందుగాని శల్యములు ఉండిపోతే గృహనిర్మాణము ఆరంభించిన తరువాత గాని గృహనిర్మాణాంతర ముగాని ఈ దోష ములను సరిచేయుట కష్టసాధ్యము కావచ్చు ను. కోన్ని చోట్ల వారివారి ఆచారాలను అనుసరించి కొన్ని పూజలు చేయవలసి ఉంటుంది. మాంసహారమును ఆరగించిన తరువాత మిగిలిన **ఎముకలను, జంతు చర్మమును** ఇంటి ఆవరణలో గొయ్యితీసి అందులో వేసి తిరిగి పూడ్చివేయటం ఆచా రంగా పాటిస్తారు. ఇటువంటి ఆచారాలను పాటించటం తప్పనిసరి అయినప్పుడు ఎముకలను మొదలైన వాటిని పూడ్చటానికి తీసే **గొయ్యిని 9అడుగుల** మేరకు లోతుగా తీసి అందులో శల్యములను వేసి పూడ్చేయ టం వలన దోషముండదు.

### రుణ బాధలు తగ్గాలంటే..

▶▶ మేము 2010లో నూతన గృహము కట్టుకున్నాము. ఆ తరువాత 2 సంవత్సరాల వరకు అంతా బాగానే ఉన్నది. తరువాత మాకు ఆర్థిక ఇబ్బందులు. మా వారు చేయు వ్యాపారం దెబ్బతీయటం జరిగింది. అప్పటి నుండి మా వారు ఎన్ని ఉద్యోగాలు, ప్రయత్నాలు చేయుచున్నప్పటికీ స్థిరత్వం లేదు. రుణ బాధలు ఎక్కువయ్యాయి.

– కె.వి.ఎల్, నిడుదవోలు.

ఉత్తరాన 20 అడుగుల ఖాళీ స్థలము ఉన్నప్పుడు పూర్తి వాయువ్యములో బాత్‌రూ మ్ కట్టవలసింది కాదు. వాటిని నిర్మూలించండి. ప్రధాన గృహము నుండి 4అడుగులు వదిలి 8అడుగులలో టాయిలెట్ / బాత్‌రూమ్‌ని నిర్మించండి. 8 అడుగులు ఉత్తర వాయువ్యానికి ఖాళీగా వదిలేయండి. తప్పకుండా మెరుగైన ఫలితాలు కనిపిస్తాయి. రుణ బాధలు తగ్గుతాయి.


వచ్చేవారం... 'పాషాణ వేధ'





మీ ప్రశ్నలు పంపించవలసిన చిరునామా : వాస్తుసాయి సేవా ఆశ్రమం
వాస్తు వీక్షణం, 3-2-4, కింగ్స్‌వే, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్ - 500003.
For Personal Visits & Appointments
Cell: 988 544 6501, 988 544 9458
Ph : 040 - 2781 7446, email : saisreevasthu@gmail.com



## నిమ్మకాయ ఊరగాయ

**కావలసినవి:** నిమ్మకాయలు – 10
ఉప్పు – తగినంత, పసుపు – టీ స్పూను
ఎండు మిరపకాయలు – 50 గ్రా. (నూనె లేకుండా వేయించి మెత్తగా పొడి చేయాలి)
మెంతి పొడి – టీస్పూను
ఆవ పొడి – టీస్పూను
ఇంగువ – అర టీస్పూను
నువ్వు పప్పు నూనె – పావు కేజీ

**తయారీ:** ● ముందుగా నిమ్మకాయలను నీళ్లలో శుభ్రంగా కడిగి ఆరబెట్టాలి ● ఒక్కో కాయను ఎనిమిది ముక్కలుగా తరగాలి. ముక్కలకు తగినంత ఉప్పు, పసుపు జత చేసి డబ్బాలో ఉంచాలి ● మూడవ రోజు ముక్కలను గట్టిగా పిండి రసం వేరు చేయాలి ● ముక్కలను, నిమ్మరసాన్ని నాలుగు రోజులు ఎండబెట్టాలి. ఎండిన ముక్కలను, రసాన్ని గాలి చొరని డబ్బాలో నిల్వ చేసుకోవాలి ● కావలసినప్పుడు కొన్ని కొన్ని ముక్కలు తీసుకుని, కారం పొడి, మెంతి పొడి, ఆవ పొడి వేసి బాగా కలపాలి ● బాణలిలో నూనె వేసి కాగాక, కొద్దిగా చల్లారిన తరువాత ఇంగువ వేసి కలపాలి ● నిమ్మకాయ ఊరగాయలో వేసి బాగా కలపాలి ● ఇందులో ఉండే సి విటమిన్ శరీరానికి ఎంతో ఉపయోగం.



## టొమాటో ఊరగాయ

**కావలసినవి:** టొమాటోలు – కేజీ
చింతపండు – 100 గ్రా., ఉప్పు – తగినంత
మెంతి పొడి – టీస్పూను
ఆవ పిండి – టేబుల్ స్పూను
ఎండు మిర్చి – 100 గ్రా.
నూనె – పావు కేజీ, ఇంగువ – టీస్పూను
ఎండు మిర్చి – 10, ఆవాలు – టీస్పూను
జీలకర్ర – టీస్పూను

**తయారీ:** ● ఎండు మిర్చిని బాణలిలో నూనె లేకుండా వేయించి, చల్లారాక మిక్సీలో వేసి మెత్తగా పొడి చేయాలి ● టొమాటోలను శుభ్రంగా కడిగి ఆరబెట్టాలి ● ప్రతి టొమాటోను నాలుగు ముక్కలుగా తరగాలి ● ఒక పెద్ద పాత్రలో టొమాటో ముక్కలకు ఉప్పు జత చేసి ఒక రాత్రంతా వదిలేయాలి ● మరుసటి రోజు ఉదయం టొమాటో ముక్కలను గట్టిగా పిండి, ముక్కలను, రసాన్ని వేరు చేయాలి ● రసంలో చింతపండు వేయాలి ● ముక్కలు, చింతపండు రసం చిక్కబడేవరకు వేరువేరుగా సుమారు మూడు రోజులు ఎండబెట్టాలి ● మిక్సీలో చింతపండు రసం, ఎండిన ముక్కలు వేసి బాగా మెత్తగా చేయాలి ● మెంతి పొడి, ఆవ పొడి, కారం పొడి జత చేసి మరో మారు మిక్సీ పట్టాలి. బాణలిలో నూనె కాగాక ఆవాలు, జీలకర్ర, ఎండు మిర్చి వేయించి దించేయాలి ● నూనె కొద్దిగా చల్లారాక ఇంగువ వేసి బాగా కలిపి, తయారుచేసి ఉంచుకున్న పచ్చడిలో వేసి కలపాలి ● ఈ పచ్చడి సుమారు నెల రోజులు నిల్వ ఉంటుంది.



## మాగాయ

**కావలసినవి:** మామిడి కాయలు – 12, ఉప్పు – తగినంత
పసుపు – 2 టేబుల్ స్పూన్లు, ఎండు మిర్చి – పావు కేజీ
మెంతిపొడి – 100 గ్రా. (ఇష్టం ఉంటే), ఆవపొడి – 100 గ్రా.
ఇంగువ – టేబుల్ స్పూను, నువ్వుపప్పు నూనె – అర కేజీ

**తయారీ:** ● ముందుగా మామిడి కాయలను శుభ్రంగా కడిగి ఆరబెట్టాలి ● పైన తొక్కు తీసి, సన్నగా చిన్న చిన్న ముక్కలుగా తరగాలి ● ఉప్పు, పసుపు జత చేసి రెండు రోజులు డబ్బాలో ఉంచాలి ● మూడవ నాడు ముక్కలను గట్టిగా పిండాలి ● ముక్కలను, రసాన్ని వేరు వేరుగా సుమారు నాలుగు రోజులు ఎండబెట్టాలి ● చిక్కబడిన రసంలో ముక్కలు వేసి బాగా కలిపి డబ్బాలో నిల్వ చేసుకోవాలి (ఉప్పు తగ్గితే బూజు పడతాయి) ● బాణలిలో నూనె లేకుండా ఎండు మిర్చి వేయించి చల్లారాక మెత్తగా పొడి చేయాలి ● బాణలిలో నూనె వేసి గోరు వెచ్చగా చేసి ఇంగువ వేసి బాగా కలిపి దించేయాలి ● తయారుచేసి ఉంచుకున్న మాగాయి ముక్కలలో ఆవ పొడి, మెంతి పొడి, కారం పొడి వేసి బాగా కలపాలి ● ఇంగువ నూనె పోసి మరోమారు కలిపి రెండు రోజుల తరువాత వాడుకుంటే సరిపోతుంది.
(ఊరగాయ ఒకేసారి తయారుచేసుకోవక్కర్లేదు. కావాలనుకున్నప్పుడు కొద్దికొద్దిగా ముక్కలు తీసుకుని, తయారుచేసుకోవచ్చు. ఈ ముక్కలు ఏడాది పొడవునా నిల్వ ఉంటాయి)



- సేకరణ: డా. పురాణపండ వైజయంతి

## చల్ల మిరపకాయలు

**కావలసినవి:** బజ్జీ మిరపకాయలు – కేజీ, పెరుగు – లీటరు (కొద్దిగా పుల్లగా ఉండాలి), ఉప్పు – తగినంత, పసుపు – టేబుల్ స్పూను

**తయారీ:** ● బజ్జీ మిరపకాయలను శుభ్రంగా కడిగి నీడలో ఆరబెట్టాలి ● పెరుగులో ఉప్పు, పసుపు వేసి, తగినన్ని నీళ్ల జత చేసి గిలక్కొట్టాలి ● పిన్నీసు సహాయంతో మిరపకాయలను పొడవుగా ఒక వైపు చీల్చాలి ● కారం తినలేనివారు గింజలను తీసేయాలి ● మిరప కాయలను మజ్జిగలో వేసి ఒక రోజంతా నాననివ్వాలి ● మరుసటి రోజు ఉదయం మిరపకాయలను మజ్జిగ నుంచి వేరు చేసి ప్లాస్టిక్ పేపర్ మీద వేసి ఎండబెట్టాలి ● మజ్జిగను కూడా ఎండబెట్టాలి ● ఎండబెట్టిన మిరపకాయలను మళ్లీ ఆ మజ్జిగలో వేయాలి ● మరుసటి రోజు మళ్లీ మజ్జిగ నుంచి వేరు చేసి ఎండబెట్టాలి ● ఈ విధంగా పూర్తి మజ్జిగ అయిపోయేవరకు చేయాలి ఆ తరువాత కేవలం మిరపకాయలను నాలుగైదు రోజులు ఎండబెట్టి గాలి చొరని డబ్బాలో నిల్వ చేసుకోవాలి ● నూనెలో వేయించుకుని మామిడికాయ పప్పుతో నంజుకుని తింటే రుచిగా ఉంటాయి.



## మెంతి / వాము మిరపకాయలు

**కావలసినవి:** బజ్జీ మిరపకాయలు – కేజీ, వాము / మెంతి పొడి – 100 గ్రా., ఉప్పు – తగినంత

**తయారీ:** ● మిరపకాయలను శుభ్రంగా కడిగి ఆరబెట్టాలి ● పిన్నీసు సహాయంతో మిరపకాయలను పొడవుగా మధ్యకు ఒక వైపు చీల్చాలి. గింజలను తీసేయాలి ● మిక్సీలో ఉప్పు, వాము వేసి తిప్పాలి. (మెంతి పొడితో తయారుచేస్తుంటే మెంతి పొడి, ఉప్పు కలపాలి) ● తయారు చేసి ఉంచుకున్న మిశ్రమాన్ని మిరపకాయలలో స్టఫ్ చేయాలి. ఎండలో ఆరేడు రోజులు బాగా ఎండబెట్టాలి ● గాలి చొరని డబ్బాలో నిల్వ చేసుకోవాలి ● నూనెలో వేయించుకుని వంకాయ ముద్ద కూర, పప్పు, కొబ్బరి పచ్చడి వంటి వాటిలో నంజుకుంటే రుచిగా ఉంటాయి. ●

● లావిష్ లైఫ్

‘లక్షాధికారియైనను లవణమన్నమే గాని మెరుగు బంగారంబు మింగబోడు’ అని అన్నాడు పాపం పూర్ వేమన. ధరలో బంగారాన్ని తలదన్నే ఆహారపదార్థాలు అందుబాటులోకి వచ్చే కాలం ఒకటి వస్తుందని ఆయన ఊహించలేకపోయాడు. ఖరీదులో బంగారాన్ని మించిన తినుబండారాలా!

మరీ బడాయి కాకపోతే అనుకుంటున్నారా..?

ఇదిగో ఇక్కడి ఫొటోల్లో కనిపిస్తున్న వంటకాల విశేషాలను చిత్తగించండి...

# విలాస వంటకంబు



## లిండెత్ చాక్లెట్ పుడ్డింగ్

బ్రిటన్‌లోని విండర్‌మియర్‌లోని లిండెత్ హోవో కంట్రీహౌస్ హోటల్‌లో మాత్రమే లభ్యమయ్యే ఈ ప్రత్యేక వంటకం తయారీలో తినడానికి పనికొచ్చే స్వచ్ఛమైన 24 క్యారట్ల బంగారు రేకులు, కేవియర్ వాడతారు. వీటికి తోడుగా రెండు క్యారట్ల వజ్రం కూడా అలంకరిస్తారు. దీని ఖరీదు అక్షరాలా 35 వేల డాలర్లు (రూ.22.73 లక్షలు). ఇది కోరుకునేవారు కనీసం రెండువారాల ముందుగా ఆర్డర్ చేయాల్సి ఉంటుంది.

## లగ్జరీ జీబ్రా క్రోనట్

కళాఖండంలా కనిపించే ఈ లగ్జరీ జీబ్రా క్రోనట్‌ను డోనట్‌కు కజిన్ అనుకోవచ్చు. లండన్‌లోని డమ్ డమ్ డోనటీర్ రెస్టారెంట్‌లో మాత్రమే ప్రత్యేకంగా దొరుకుతుంది. దీని తయారీలో క్రిస్టల్ రోజ్ షాంపేన్ కేవియర్, 23 క్యారట్ల బంగారు రేకులు, తహైతియన్ గోల్డ్ వెనీలా బీన్స్, నార్మండీ బటర్, న్యూటెల్లా పౌడర్ ఉపయోగిస్తారు. వీటికి తోడు ప్రపంచంలోనే అత్యంత ఖరీదైన అమెడీ పోర్సెలానా చాక్లెట్ వాడతారు. దీని ఖరీదు రెండువేల డాలర్లు (రూ. 1.30 లక్షలు) మాత్రమే.





## గోల్డెన్ ఓపు

స్వర్ణకాంతు
హిమక్రీము కూ
సెరెండిపిటీ 3 రె
ప్రత్యేకంగా
తయారీలో
రేకులు, మడగా
సిరప్, అరుదైన కరే
నుంచి తయారు
గ్రాండ్ ప్యాషన్
ఈ హిమక్రీము
చేయాల్సి ఉ

## లూయీ-13 పిజ్జా

ప్రపంచంలోనే అత్యంత ఖరీదైన పిజ్జా ఇది. పిజ్జాకు పుట్టినిల్లయిన ఇటలీలోని వెనిస్ నగరానికి చెందిన హోటల్ సిప్రియానీలో మాత్రమే ఇది ప్రత్యేకంగా లభిస్తుంది. దీని తయారీలో ఆర్గానిక్ గోధుమ పిండి, అత్యంత అరుదైన ఆస్ట్రేలియన్ పింక్ సాల్ట్, ఖరీదైన ఎనిమిది రకాల చీజ్, బెలుగా తిమింగలం మాంసం, అరుదైన రకాల రొయ్యలు, పీతలు ఉపయోగిస్తారు. దీని తయారీకి ముందు పిండిని 72 గంటల సేపు నానబెడతారు. ఇది కావాలనుకునే వారు మూడు రోజుల ముందు ఆర్డర్ చేయాలి. దీని ఖరీదు 12 వేల డాలర్లు (రూ.7.80 లక్షలు) మాత్రమే.



## సెరెండిపిటీ 3 ఫ్రోజెన్ హాట్ చాక్లెట్

చవులూరించే ఈ అమెరికన్ హిమక్రీముకు కేరాఫ్ అడ్రస్ న్యూయార్క్‌లోని సెరెండిపిటీ 3 రెస్టారెంట్. అక్కడ మాత్రమే ప్రత్యేకంగా దొరికే ఈ ఫ్రోజెన్ హాట్ చాక్లెట్ తయారీలో ప్రపంచంలోనే అత్యంత అరుదుగా దొరికే కోకాగింజల పొడిని, మడగాస్కర్ వెనీలాను, 18 క్యారట్ల బంగారు రేకులను ఉపయోగిస్తారు. గార్నిషింగ్ కోసం వజ్రాలను కూడా వాడతారు. దీని ఖరీదు 25 వేల డాలర్లు (రూ.16.24 లక్షలు) మాత్రమే.



డ
సెల్
ప్రత్యే
తయా
ఐదువే
కోన్యా
షాంపే
బెల్జి

## ...లెన్స్ ఐస్‌క్రీమ్

...లతో ధగధగలాడే ఈ ...డా న్యూయార్క్‌లోని ...స్టారెంట్‌లో మాత్రమే ...దొరుకుతుంది. దీని ...23 క్యారట్ల బంగారు ...స్కర్ వెనీలా, చాక్లెట్ ...బియన్ కోకాగింజల ...చేసిన చాక్లెట్ చిప్స్, ...కేవియర్ వాడతారు. ...కోసం కనీసం రెండు ...రోజుల ముందు ఆర్డర్ ...ంటుంది. దీని ఖరీదు వెయ్యి డాలర్లు (రూ.65 వేలు) మాత్రమే.



## గోల్డెన్ ఫీనిక్స్ కప్‌కేక్

ప్రపంచంలోనే అత్యంత ఖరీదైన కప్‌కేక్ ఇది. దుబాయ్‌లోని బ్లూమ్స్‌బరీ కేఫ్‌లో మాత్రమే ప్రత్యేకంగా లభించే ఈ అరుదైన తీపి చిరుతిండి తయారీలో అత్యంత నాణ్యమైన ఇటాలియన్ చాక్లెట్, 23 క్యారట్ల బంగారు రేకులు, బంగారు పొడి, ఆర్గానిక్ స్ట్రాబెర్రీలు, ప్రత్యేకంగా సేకరించిన ఉగాండన్ వెనీలా మొగ్గలు ఉపయోగిస్తారు. గార్నిషింగ్ కోసం అసలైన వజ్రాలను ఉపయోగిస్తారు. దీని ఖరీదు 28 వేల డాలర్లు (రూ.18.20 లక్షలు). దీనిని కోరుకునే వారు కనీసం రెండు రోజుల ముందు ఆర్డర్ చేయాల్సి ఉంటుంది.



## క్రిస్పీ క్రీమ్ డోనట్

ఖరీదైన కళాకృతిలా కనిపించే ఈ క్రిస్పీ క్రీమ్ ...ోనట్ లండన్, బర్మింగ్‌హామ్‌లలోని ...ఫ్రిడ్జెస్ రెస్టారెంట్‌లో మాత్రమే ...కంగా దొరుకుతుంది. ఈ వంటకం ...రీలో 24 క్యారట్ల బంగారు రేకులు, ...ందల ఏళ్లనాటి అత్యంత అరుదైన ...క్ బ్రాందీ, డామ్ పెరిన్యాన్ ...న్, 23 క్యారట్ల బంగారు పొడి, ...యన్ వైట్ చాక్లెట్, రాస్ప్‌బెర్రీ ఫ్రూట్ సిరప్ వాడతారు. దీని ఖరీదు 1685 డాలర్లు (రూ.1.10 లక్షలు) మాత్రమే.

## ఫిష్ ఫింగర్ శాండ్‌విచ్

యూరోప్‌లోని ప్రతిష్ఠాత్మకమైన ఫ్రోజెన్ ఫుడ్స్ బ్రాండ్ 'బర్డ్స్ ఐ' రూపొందించిన అత్యంత ఖరీదైన శాండ్‌విచ్ ఇది. బ్రిటిష్ రాణి ఎలిజబెత్ తొంభయ్యవ జన్మదినం సందర్భంగా ప్రత్యేకంగా దీనిని తయారు చేసింది. ఈ శాండ్‌విచ్ తయారీలో స్వీట్ కేవియర్, క్రీమీ శాఫ్రన్ మయొనైజ్, ఫిష్ ఫింగర్స్, ఆస్పరాగస్ కాడలు, 24 క్యారట్ల బంగారు రేకులు వాడతారు. శాండ్‌విచ్ కోసం ఆర్గానిక్ గోధుమ పిండిని ఉపయోగిస్తారు. దీని ధర 233 డాలర్లు (రూ. 15 వేలు) మాత్రమే.

# శిలలే శిల్పాలుగా ఉనకోటి

అదొక మహారణ్యం. పర్వతాలు చుట్టుముట్టిన లోయ ప్రాంతం. అయితే ఇక్కడ అడుగడుగునా ఓ అందమైన శిల్పం. అలా సుమారు కోటి శిల్పాలు అక్కడకు అడుగుపెట్టిన వారినందరినీ పలకరిస్తున్నట్లుగా ఉంటాయి. తమ హావభావాలతో కనువిందు చేస్తాయి. ఆ ప్రాంతం ఉనకోటి. ఆ రాష్ట్రం త్రిపుర. అత్యంత పురాతన శైవక్షేత్రం ఇది. బెంగాలీలో ఉనకోటి అంటే కోటికి ఒకటి తక్కువ అని అర్థం. అసలు ఇంత చిన్న రాష్ట్రంలో ఇన్ని శిల్పాలు ఎందుకు ఉన్నాయో చూద్దాం...



కొండలపై కొలువైన ఉనకోటీశ్వరుడు

ఓసారి శివుడు కోటిమంది దేవతలతో కలిసి కైలాసానికి బయలు దేరాడు. మార్గమధ్యంలో ఇక్కడి ప్రకృతి సౌందర్యానికి పరవశించి, కాసేపు విశ్రమించాలనుకున్నాడు. ఆయన వెంట వచ్చిన దేవతలందరూ కూడా ఈ రాత్రికి ఇక్కడ విశ్రాంతి తీసుకుని కాసింత సేద దీరాలను కున్నారు. అందుకు శివుడు సమ్మతిస్తాడు. అయితే మర్నాడు సూర్యోదయానికి ముందే అక్కడి నుంచి బయలుదేరాలని, లేదంటే శాశ్వతంగా అక్కడే ఉండిపోవాలని షరతు విధిస్తాడు. దేవతలందరూ తీవ్రమైన అలసట కారణంగా గాఢనిద్రలో మునిగిపోవడంతో సూర్యోదయానికి ముందు మేలుకో లేకపోతారు. దాంతో శివుడు వారిని అక్కడే శిలలై పడి ఉండండని శపిస్తాడు.

మరో కథనం ఏమిటంటే... అప్పట్లో ఈ ప్రాంతంలో కల్లు కంహార అనే శిల్పి ఉండేవాడు. అతను శక్తి ఉపాసకుడు. ఓసారి శివగణాలతో పార్వతీ పరమేశ్వరులు ఈ మార్గం గుండా పయనిస్తున్నారు. అది తెలిసి అక్కడికి చేరుకున్న కల్లు తననూ వారితో తీసుకు వెళ్లమని ప్రార్థించాడు. అందుకు పరమేశ్వరుడు సమ్మతించలేదు. తన భక్తుడు కావడంతో తెల్లవారేలోగా కోటి శిల్పాలను చెక్కగలిగితే శివుణ్ణి ఎలాగైనా ఒప్పించి తమతో తీసుకు వెళ్లేలా చేస్తానని పార్వతి చెప్పింది. అతను ఆనందంతో విగ్రహాలు చెక్కడం మొదలు పెట్టాడు. అయితే దురదృష్టవశాత్తూ అవి కోటికి ఒకటి తక్కువగా ఉన్నాయి. దాంతో పరమేశ్వరుడు అతన్ని కైలాసానికి రానివ్వలేదు. అసలు విషయం ఏమిటంటే, తాను చాలా గొప్పశిల్పినని అతనికి అహంభావం. పైగా బొందితో కైలాసానికి వెళ్లాలన్న కోరిక చాలా అసంబద్ధమైనది, అందుకే పరమేశ్వరుడతన్ని అనుగ్రహించలేదు.

ఇక శిల్పాల విషయానికి వస్తే, ఇవి 30-40 అడుగుల ఎత్తున ఉంటాయి. అయితే అన్నీ అసంపూర్తిగా ఉంటాయి. వీటి పళ్లు, కళ్లు అలంకరణ, హావభావాలు అన్నీ కూడా అక్కడి గిరిజనులను ప్రతిబింబిస్తుంటాయి. ఈ పర్వత ప్రదేశంలోని ప్రతి మూలకూ వెళ్లడానికి ఎగుడుదిగుడుగా, అడ్డదిడ్డంగా రిబ్బన్ ఆకారంలో మెట్లు, పర్వతాలను అనుసంధానిస్తూ వంతెనలూ ఉన్నాయి. ఇక్కడ కాలు పెట్టగానే ఇంతటి అద్భుతమైన సుందరప్రదేశాన్ని ప్రపంచం ఎందుకు విస్మరించిందా అనిపిస్తుంది.

ఇక్కడి శివుడికి ఉనకోటీశ్వర కాలభైరవుడని పేరు. దాదాపు ముప్పై అడుగుల ఎత్తులో చెక్కి ఉంటుంది శివుడి విగ్రహం. ఆయన తలే పదడుగులుంటుంది. ఒకవైపు సింహవాహనంపై పార్వతి, మరోవైపు గంగ ఉంటారు. పాదాల చెంత మూడు పెద్ద పెద్ద నంది విగ్రహాలు భూమిలో కూరుకుపోయినట్లుగా కనిపిస్తాయి. ఉనకోటీశ్వరుడికి ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం అర్చనలు, అభిషేకాలు జరుగుతుంటాయి. పూజారులు ఇక్కడికి దగ్గరలో భక్తులకు అందుబాటులో ఉంటారు.

ఇక్కడి రాతి విగ్రహాలకు పైన చక్కటి పచ్చిక బయళ్లు, కింది భాగాన గలగల పారే సెలయేళ్లు లేదా పైనుంచి కిందికి పరవళ్లు తొక్కుతూ పడే జలపాతాలు ఉంటాయి.

ప్రతి ఏటా ఏప్రిల్‌లో ఇక్కడ పెద్ద ఎత్తున జరిగే అశోకాష్టమి ఉత్సవాలకు త్రిపుర నుంచే గాక చుట్టుపక్కల రాష్ట్రాలనుంచి వేలాది మంది భక్తులు విచ్చేస్తారు. జనవరిలో కూడా చిన్నపాటి ఉత్సవం నిర్వహిస్తారిక్కడ.

- డి.వి.ఆర్.భాస్కర్

## ఎలా చేరుకోవాలి?

త్రిపుర రాజధాని అగర్తలాకు న్యూఢిల్లీ, అస్సాం, నాగాలాండ్, బిహార్, పశ్చిమ బెంగాల్, ఉత్తర ప్రదేశ్... ఇలా ఇంచుమించు అన్ని ప్రధాన నగరాల నుంచి ట్రెయిన్లు ఉన్నాయి. రైలుమార్గంలో వచ్చేవారికి అతి సమీపంలోని రైల్వే స్టేషన్ కుమార్‌ఘాట్. అక్కడి నుంచి హెలికాప్టర్‌లో ఉనకోటి శిల్పసౌందర్యాన్ని వీక్షించ వచ్చు. విమానంలో వచ్చేవారు ఐజ్వాల్ విమానాశ్రయంలో దిగాలి. అక్కడి నుంచి ఉనకోటికి నేరుగా ట్యాక్సీలు ఉంటాయి. త్రిపుర పర్యాటకాభివృద్ధి శాఖ హెలికాప్టర్ ఛార్జీలను అందుబాటు ధరలోనే ఉంచడం కొంత ఉపశమనం కలిగిస్తుంది.

## దగ్గరలో ఏమేమి చూడవచ్చంటే...

త్రిపురకు దగ్గరలో కైలాసహర్, మామిట్, అగర్తలా, కోలాసిబ్, చిరపుంజి, కాలిమ్‌పాంగ్, ఆగ్రా, మాండులను కూడా చూడవచ్చు.

• న్యూ ఫేస్

# పైనాపిల్ ప్యాక్

మేని మెరుపుకోసం మగువలు చేయని ప్రయత్నం ఉండదు. కాస్మొటిక్ క్రీమ్స్ దగ్గర నుంచి పార్లర్ల చుట్టూ ప్రదక్షిణలు చేసి చేసి... తమ అందాన్ని కాపాడుకునే ప్రయత్నం చేస్తూనే ఉంటారు. ఎన్ని ప్రయత్నాలు చేసినా మెరుపు తాత్కాలికమే అవుతున్నప్పుడు మరింత కేర్ అవసరం. దానికోసం కాస్త సమయం కేటాయిస్తే చాలు.. నిగారించే మెరుపు మీ సొంతమైపోతుంది. ప్రయత్నించండి.

కావల్సినవి:

పైనాపిల్ గుజ్జు –3 టేబుల్ స్పూన్స్
కొబ్బరి పాలు –2 టేబుల్ స్పూన్స్
స్వచ్ఛమైన తేనె –పావు టేబుల్ స్పూన్

తయారీ:

ముందుగా పైనాపిల్ గుజ్జును ఓ బౌల్‌లోకి తీసుకోవాలి. అందులో కొబ్బరి పాలు, తేనె కలుపుకొని బాగా మెత్తగా చేసుకోవాలి. తరువాత ముఖం చల్లని నీళ్లతో కడుక్కుని ఓ 3,4 నిమిషాలు ఆవిరి పట్టుకోవాలి. తరువాత మెత్తటి క్లాత్‌తో ముఖం తుడుచుకుని ఈ మిశ్రమాన్ని అప్లై చేసుకోవాలి. అరగంట తరువాత గోరువెచ్చని నీళ్లతో ముఖం కడుక్కుంటే సరిపోతుంది. ఇలా ఓ వారం రోజులు క్రమం తప్పకుండా చేస్తే ముఖానికి మంచి మెరుపు, నిగారింపు వస్తుంది.



# కాస్త కొత్తగా...

మన మేకప్ కిట్‌లో నాలుగైదు నెయిల్ కలర్స్ ఉంటే చాలు, ఎలాంటి నెయిల్ ఆర్టైనా మీ సొంతమైపోతుంది. వేసుకున్న డ్రెస్‌కి తగ్గట్టుగా నెయిల్స్‌ని మెరిపించుకోవచ్చు. ఈ ఆర్ట్ చూడండి. ఎంత బాగుందో. మీ డ్రెస్ మేచింగ్‌ని బట్టి ఒక లైట్ కలర్, ఒక డార్క్ కలర్ నెయిల్ పాలిష్‌లతో పాటూ బ్లాక్ అండ్ వైట్ కలర్స్ ఉంటే చాలు. ఈ అందమైన నెయిల్ ఆర్ట్ మీ సొంతమవుతుంది.

1. ముందుగా నెయిల్స్ శుభ్రం చేసుకుని షేప్ చేసుకోవాలి. తరువాత ఎల్లో లేదా ఏదైనా మీకు నచ్చే లైట్ కలర్ తీసుకుని గోళ్లకు అప్లై చేసుకోవాలి.
2. తరువాత పిక్చర్‌లో చూపించినట్లు కొంచెం బ్రైట్ కలర్ నెయిల్ పాలిష్ తీసుకుని గోళ్ల ముందు భాగంలో వేసుకుని, కాస్త వెనక్కి కూడా లైట్‌గా స్ప్రెడ్ చేసుకోవాలి.
3. తరువాత బ్లాక్ కలర్ తీసుకుని అన్ని గోళ్లపైనా పిక్‌లో చూపించినట్లు (ఫిష్ షేప్‌లో) డిజైన్ చేసుకోవాలి.
4. ఇప్పుడు వైట్ కలర్ నెయిల్ పాలిష్ తీసుకుని... ముందు డిజైన్ చేసుకున్న షేప్‌కి పైన కింద అప్లై చేసుకోవాలి.
5. తరువాత పైన అప్లై చేసుకున్న వైట్ కలర్‌లో ఒక బ్లాక్ చుక్క పెట్టుకుంటే చాలు మంచి లుక్ వస్తుంది.
6. చివరిగా నెయిల్స్ ఆరిన తరువాత... ట్రాన్స్‌పరెంట్ కలర్ అప్లై చేసుకుంటే, గోళ్లు మరింత అందంగా కనిపిస్తాయి.

• నెయిల్‌ఆర్ట్



● కొత్తకొత్తగా

# చల్లచల్లని కూల్‌కూల్






వేసవి కాలం వచ్చిందంటే అందరి నోటా చల్లచల్లని కూల్‌కూల్ అనే మాటే వినిపిస్తుంది. వడగాలులకు తాళలేక.. తినేదైనా.. తాగేదైనా.. కూల్ కూల్‌గా ఉండాలని కోరుకుంటాం. అలాంటి వారి కోసమే ఈ మిషన్. ఫ్రిజ్ అవసరం లేకుండా ఇందులోనే డైరెక్ట్‌గా రకరకాల ఫ్లేవర్స్‌లో ఐస్ క్రీమ్స్ తయారు చేసుకోవచ్చు. పండ్లు, పాలు, పెరుగులతోనే ఐస్ క్రీమ్స్ ఎలా ప్రిపేర్ చేసుకోవచ్చు అనేది వివరిస్తూ.. ఈ మిషన్‌తో పాటూ ఒక మెనూ రెసిపీ బుక్ కూడా ఉంటుంది. ఇక ఈ మెషిన్‌లో సాఫ్ట్ లేదా హార్డ్ అనే ఆప్షన్స్ కూడా ఉంటాయి. వాటిని ప్రెస్ చేసి మనకు కావాల్సిన విధంగా ఐస్‌క్రీమ్‌ను సిద్ధం చేసుకోవచ్చు.

ధర
109.99 డాలర్లు
(రూ.7,070)

# యంత్రుడు... ఓ మంచి పనోడు...

ఒకటి రెండు కాదు షేర్‌ఖాన్, ఈ యంత్రుడు ఏకంగా వెయ్యి సలాడ్స్‌ను తయారు చేయగలడు. అది కూడా ఒక్క సలాడ్‌ను... ఒకే ఒక్క నిమిషంలో... అంటూ అక్షరాలా అరవై సెకన్లలో సిద్ధం చేయగలడు. అవును. మిస్టర్ యంత్రుడు మనిషి కాదు ఓ రోబో. ఆర్డర్ ఇవ్వడమే ఆలస్యం మీకు కావాల్సిన సలాడ్‌ను నిమిషంలో అందిస్తాడు. మీకు ఏ సలాడ్ కావాలి... అందులోకి ఏ ఫ్రూట్స్ కావాలి, ఏ వెజిటబుల్స్ కావాలి.. వంటివన్నీ ఆర్డర్ తీసుకుంటూ సరిగ్గా అరవై సెకన్లలో మీరు కోరుకున్న సలాడ్‌ను మీ చేతికి అందిస్తుంది.'' ఇందులో అన్ని సలాడ్స్‌కు సంబంధించిన ఫుడ్ మెటీరియల్‌కు ప్రత్యేకమైన అరలు ఉంటాయి. వెజిటబుల్/ఫ్రూట్స్‌ను శుభ్రం చేసి సంబంధిత అరల్లో పెట్టేస్తే చాలు. తరగటం నుంచి, కలిపి ఇవ్వడం వరకూ అన్నీ తానే చూసుకుంటుంది. అంతే కాదు... మనం తీసుకోనున్న సలాడ్‌లో ఏది ఎంత కేలరీల్లో మిక్స్ అవుతుందో కూడా మనకు చూపించేస్తుంది.




# ఏం తీసుకుంటారు? టీ ఆర్ కాఫీ...



ఉదయాన్నే లేవగానే... టీనో, కాఫీనో గొంతులో పడకపోతే చాలా మందికి రోజు మొదలుకాదు. ఘుమఘుమలాడే టిఫిన్స్ ఎన్ని సిద్ధంగా ఉన్నా... 'ఒక్క కప్పు, ఒకే ఒక్క కప్పు' అంటూ.. ఖడ్గం సినిమాలో రవితేజలా బెడ్ కాఫీ/టీ కోసం ఆశపడతారు. అలాంటి వారికి ఈ మిషన్ బాగా ఉపయోగపడుతుంది. ఇందులో టీ అయినా కాఫీ అయినా నిమిషాల్లో పెట్టేసుకోవచ్చు. అచ్చు చెక్కబొమ్మలా కనిపిస్తున్న ఈ మిషన్‌లో పైన టాప్‌లో ఒక మూత ఉంటుంది. అది ఓపెన్ చేసి వాటర్ పోసుకుని.. పైన గాజు గ్లాస్‌తో టీ లేదా కాఫీ పౌడర్ వేసుకుని బటన్ ఆన్ చేస్తే చాలు. కింద గుండ్రని ప్లేస్‌లో గ్లాస్ పెట్టుకుంటే తయారైన మిశ్రమం అందులోకి వచ్చి చేరుతుంది. ఈ మిషన్ ద్వారా కేవలం పౌడర్ మాత్రమే కాదు లీవ్స్ అంటే గ్రీన్ టీ లాంటివి కూడా పెట్టుకోవచ్చు. అంటే అల్లం టీ, బెల్లం టీ, ఏలకుల టీ, లెమెన్ టీ అంటూ మీకు కావాల్సిన ఫ్లేవర్స్‌లో చేసుకుని హాయిగా తాగెయ్యొచ్చు.




ధర
99 డాలర్లు
(రూ.6,363)

## పిజ్జా కప్స్

కావల్సినవి:
బ్రెడ్ - 6 లేదా 7
టమాటా-2
మొక్కజొన్న గింజలు-పావు కప్పు
పచ్చిమిర్చి - 2 లేదా 3
ఉల్లిపాయలు - 2
మసాలా- 1 టేబుల్ స్పూన్
ఉప్పు-తగినంత
ఆయిల్- సరిపడా

తయారీ:
ముందుగా టమాటా, ఉల్లిపాయలు, పచ్చిమిర్చిలను చిన్న చిన్న ముక్కలుగా తరిగి పక్కన పెట్టుకోవాలి. తరువాత బ్రెడ్ నాలుగువైపుల కట్ చేసుకుని ఉంచుకోవాలి. ఇప్పుడు ఒక పెద్ద బౌల్ తీసుకుని టమాటా, ఉల్లిపాయ, పచ్చిమిర్చి ముక్కలతో పాటూ... మొక్కజొన్న గింజలు, ఉప్పు, మసాలా వేసుకుని బాగా కలుపుకోవాలి. తరువాత బ్రెడ్ ముక్కలను మినీ కేక్ పాన్‌లోని బౌల్స్‌లో పెట్టుకుని, అందులో టమాటా మిశ్రమాన్ని కొద్దికొద్దిగా పెట్టుకోవాలి. తరువాత వాటిల్లో లైట్‌గా ఆయిల్ వేసుకుని 10 లేదా 15 నిమిషాలు ఉడికించుకుంటే సరిపోతుంది.

## బీట్‌రూట్ స్కోన్స్



కావల్సినవి:
శనగపిండి – 2 కప్పులు
బేకింగ్ పౌడర్ – 2 టేబుల్ స్పూన్స్
ఉప్పు – తగినంత
పెరుగు – పావు కప్పు
చెడ్డార్ చీజ్ – 25 గ్రాములు
బీట్ రూట్ ముక్కలు – అర కప్పు
పాలు – 6 లేదా 7 టేబుల్ స్పూన్స్
తేనె – 2 లేదా 3 టేబుల్ స్పూన్స్
నూనె – సరిపడా

తయారీ:
ముందుగా చీజ్ కరిగించుకుని శనగపిండిలో బాగా కలుపుకోవాలి. తరువాత బేకింగ్ పౌడర్, పెరుగు, ఉప్పు కలిపి పక్కన పెట్టుకోవాలి. తరువాత బీట్‌రూట్ ముక్కలతో పాటు పాలు, తేనె కూడా కలిపి మిక్స్ చేసుకోవాలి. తరువాత రెండు మిశ్రమాలను బాగా కలిపి ముద్దలా చేసుకోవాలి. ఇప్పుడు సింబల్ లేదా మీకు నచ్చిన షేప్‌లో చిన్న చిన్న ముద్దలు చేసుకుని పాన్‌పై వేయించుకోవాలి. వీటిని టమాటా సాస్‌లో నంజుకుని తింటే భలే టేస్ట్‌గా ఉంటాయి.

## టాంగీ గోవా షీరా

కావల్సినవి: గోధుమ రవ్వ – అర కప్పు
నెయ్యి – 2 టేబుల్ స్పూన్లు
వేడి నీళ్లు – అర కప్పు
గోవా పేస్ట్ – అర కప్పు (మార్కెట్‌లో దొరుకుతుంది)
ఉప్పు – తగినంత
యాలకుల పొడి – అర టేబుల్ స్పూన్
కొబ్బరి తురుము – 2 టేబుల్ స్పూన్స్

తయారీ: ముందుగా పాన్ తీసుకుని అందులో నెయ్యి వేసి వేడి చేసుకోవాలి. తరువాత గోధుమ రవ్వను వేసుకుని దోరగా వేయించుకోవాలి. తరువాత వేడి నీళ్లు పోసుకుని మొత్తం కలపాలి. తరువాత ఆ మిశ్రమంలో గోవా పేస్ట్, ఉప్పు వేసుకుని బాగా కలుపుకోవాలి. తరువాత యాలకుల పొడి, కొబ్బరి తురుము వేసుకుని గరిటతో మొత్తం కలుపుకుని, 5 లేదా 7 నిమిషాలు ఉడికించుకోవాలి. బాగా దగ్గరపడిన తరువాత దించేసుకుని మనకు నచ్చిన షేప్‌లో స్వీట్స్ చేసుకుని నచ్చిన విధంగా గార్నిష్ చేసుకుంటే సరిపోతుంది.








# బిగ్ బ్రైడ్ బన్

ఎప్పుడు చూసినా ఇంట్లో ఉండే పెద్దమ్మనో, పక్కింటి పిన్నమ్మనో మోడల్ జడలు వేయమని అడగటమేనా...? అవసరం లేదు. మీకు మీరే వేసుకోవచ్చు. వాళ్లకు వచ్చిన ఓల్డ్ మోడల్స్ కాదండి. న్యూ మోడల్స్, లేటెస్ట్ మోడల్స్. మీకు మీరే అల్లుకుని ఔరా అనిపించొచ్చు. వేసుకున్న డ్రెస్‌కు తగ్గట్టు, మీ ఫేస్ కట్‌కి తగ్గట్టు రోజుకో మోడల్ వేసుకోవచ్చు. అందుకే ఈ వారం మీ కోసం ఈ ఓ సరికొత్త మోడల్.

1 ముందుగా చిక్కులు లేకుండా హెయిర్ మొత్తం దువ్వుకోవాలి. తరువాత కుడివైపు ముందు భాగంలో కాస్త ఫంక్ వదులుకుని, మూడు పాయలు తీసుకోవాలి.

2 తరువాత మూడు పాయలను అల్లుకుంటూ.. వెనుక భాగంలోని హెయిర్ నుంచి ఒక్కో పాయను ఆ జడకు యాడ్ చేసుకోవాలి.

3 చివరి వరకూ అలానే పాయలు కలుపుకుంటూ జడ అల్లుకోవాలి.

4 ఇప్పుడు జడ మొత్తం అల్లిన తరువాత హెయిర్ బ్యాండ్ పెట్టుకుని, జడ మొత్తం లూజ్‌గా చేసుకోవాలి.

5 జడ అల్లగా మిగిలిన హెయిర్‌కు చిన్న రబ్బర్ బ్యాండ్ పెట్టుకుని టైట్ చేసుకోవాలి.

6 తరువాత చిన్న రబ్బర్ బ్యాండ్‌పైన పెద్ద హెయిర్ బ్యాండ్ పెట్టుకోవాలి.

7 ఇప్పుడు బ్యాండ్ పెట్టుకున్న హెయిర్ మొత్తం చిక్కులు లేకుండా దువ్వుకోవాలి.

8 తరువాత ఆ హెయిర్ మొత్తం పెద్ద బ్యాండ్‌లోకి రివర్స్‌లో పెట్టుకుని ముడిలా చేసుకోవాలి.

9 ఇప్పుడు ముందుగా అల్లుకున్న జడను ముడి కింద నుంచి తిప్పుకుని, ఎడమ వైపుకు తీసుకుని టైట్‌గా పెట్టుకోవాలి.

10 చివరిగా ఆ జడ ఊడిపోకుండా ఉండేందుకు జడకు, ముడికి కలిపి హెయిర్ పిన్ పెట్టుకోవాలి.

కుర్తీ మోడల్స్‌లో ఎన్ని ఉన్నా మరో కొత్త స్టైల్ కోసం వెతుకుతూనే ఉంటాం. దాంట్లో భాగంగా సింపుల్‌గా అనిపిస్తూనే స్టైలిష్ లుక్‌తో ఆకట్టుకునే మోడల్ కుర్తీ డ్రాఫ్టింగ్ గురించి తెలుసుకుందాం. మిగతా కుర్తీల మాదిరిగానే ఈ డ్రాఫ్టింగ్ ఉన్నప్పటికీ కొన్ని చిన్న చిన్న తేడాలు ఉంటాయి. వాటిలో కుడి వైపున నెక్ నుంచి నడుము వరకు ఉండే స్ట్రెయిట్ లైన్ కట్, అటు నుంచి కుర్తీ పొడవున ఉండే స్లిట్ దీని ప్రత్యేకత. ఈ కుర్తీ ఫ్రంట్ అండ్ బ్యాక్ డ్రాఫ్టింగ్ సరిచూసుకొని డిజైన్ చేసుకోవాలి.

# ఫ్రంట్ స్లిట్ కుర్తీ



**కొలతలు ఇంచులలో!**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఛాతీకొలత | 32 | 34 | 36 | 38 | 40 | 42 |
| బస్ట్ కొలత | 33 | 35 | 36 | 38 | 40 | 42 |
| బస్ట్ కింది భాగం | 26 | 27 | 30 | 32 | 34 | 37 |
| హిప్ | 33 | 34 | 38 | 40 | 42 | 45 |
| భుజం | 11 | 12 | 12 | 13 | 13 | 14 |
| స్లీవ్ లెంగ్త్ 3/4 | 15 | 15 | 15 | 17 | 17 | 17 |
| ఆర్మ్‌హోల్ రౌండ్ | 14 | 15 | 15 | 16 | 17 | 17 |
| ఫ్రంట్ నెక్ లైన్ | 6 | 6.5 | 7 | 7 | 7.5 | 7.5 |
| పొడవు | 36 | 38 | 38 | 38 | 40 | 40 |


రాణి
డిజైనర్

నిర్వహణ: ఎన్.ఆర్





కర్టెసీ: ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ డిజైన్ ఇన్నోవేషన్ (ఐడీఐ), హైదరాబాద్ www.idi.co.in


## ఫ్రంట్ బాడీ డ్రాఫ్టింగ్

- AB = కుర్తీ పొడవు
- AC = ఆర్మ్‌హోల్ రౌండ్/2
- AD = నడుము పొడవు
- AE = హిప్ లెంగ్త్
- A1 AO = షోల్డర్ విడ్త్
- O – 1 = నెక్ విడ్త్
- C1 C2 = ఛాతీ చుట్టుకొలత /2
- D1 D2 = వెయిస్ట్ రౌండ్/ 2
- E1 E2 = B1 B2 = హిప్ రౌండ్/ 2
- A O & A1మధ్య లైన్ నుంచి C3, C4 లైన్ మార్క్ చేయాలి. A3, A2 అర అంగుళం షోల్డర్ స్లోప్.
- A3, C3 & A2, C4 లైన్‌లకు మధ్య A4 మార్క్ చేయాలి. ఇక్కడ నుంచి అర అంగుళం లోపలికి మార్క్ చేసి A5, A6 వేయాలి.
- ఆర్మ్‌హోల్ వంపు భాగాలు A2 A5 C2 & A3 A6 C1
- AAX = ఫ్రంట్ నెక్ డెప్త్
- A6 నుంచి అర అంగుళం తీసుకొని AY మార్క్ చేయాలి. ఇక్కడ నుంచి అర అంగుళం విడ్త్ తీసుకుంటే అది AX అవుతుంది.
- AY నుంచి కిందుగా కుర్తీ పొడవు లైన్‌ని డ్రా చేయాలి. AZ నుంచి స్లిట్ తీసుకోవాలి.

## బ్యాక్ బాడీ డ్రాఫ్టింగ్

- AB = కుర్తీ పొడవు
- AC = ఆర్మ్‌హోల్ రౌండ్/2
- AD = వెయిస్ట్ లెంగ్త్
- AE = హిప్ లెంగ్త్
- CC1 = ఛాతీ చుట్టుకొలత /4
- DD1 = నడుము కొలత / 4
- EE1 = BB1 = హిప్ చుట్టుకొలత /4
- C1, D1, E1, B1 కుర్తీ సైడ్ వంపు భాగం
- A1 నుంచి నిటారుగా కిందకు C2 వరకు లైన్ డ్రా చేయాలి.
- A1 నుంచి అర అంగుళం కిందుగా డ్రా చేసి. A2 మార్క్ చేయాలి. ఇది షోల్డర్ స్లోప్ అవుతుంది.
- A2 – C2కు మధ్య బిందువు A4. A2, A4, C1ఆర్మ్‌హోల్ వంపు భాగం.
- A3 AX = బ్యాక్ నెక్ డెప్త్






గూడెం తాలూకా కార్యాలయం.

క్యాంప్: కృష్ణదేవిపేట., తేదీ 29-1-1922.

రంప అసిస్టెంట్ కమిషనర్ వారి సముఖమునకు!

సరైన ఆధారాలు లేకున్నా అల్లూరి రామరాజు తిరుగుబాటు లేవదీయనున్నాడని పుకార్లు పెద్ద ఎత్తున వ్యాపించాయి. దీనితో కృష్ణదేవిపేట మొత్తం రాత్రంతా పోలీస్‌స్టేషన్ దగ్గరే గడిపింది. 28వ తేదీ రాత్రి కూడా ప్రజలు పోలీస్‌స్టేషన్ దగ్గర లేదా పొలాలలో పడుకున్నారు.

ఈ ఉదయం నేను ఎ. రామరాజును ఇంటర్వ్యూ చేశాను. అయితే తాను సహాయ నిరాకరణవాదిని కానని ఆయన చెప్పాడు. తాగుడుకు వ్యతిరేకంగా ప్రచారం మాత్రం చేస్తున్నానని అన్నాడు. ఇవన్నీ వదంతులేనని ఈ రగడ సద్దుమణిగే దాకా తాను నర్సీపట్నం వెళ్లిపోతానని కూడా చెప్పాడు.

ఇప్పటి పరిస్థితినిబట్టి పెద్ద ప్రమాదమేదీ ఉందని చెప్పను. ప్రస్తుతం అందుబాటులో ఉన్న పోలీసుల సాయంతో ఏ పరిణామాన్నయినా ఎదుర్కొనగలనని మనవి చేస్తున్నాను.

– అల్ఫ్ బాస్టియన్.

ఆ స్టేట్‌మెంట్ ఫజులుల్లాకి ఇస్తూ అన్నాడు స్పైర్, ''నువ్వు కూడా ఇలా రాస్తావని అనుకోలేదు.''

''ఆ మాటేమోగానీ, మీరు ఇలా తిరుగు టపాలోనే విచారణకి వస్తారని నేనూ ఊహించలేదు.'' అన్నాడు స్టీవర్ట్.

''చూడు స్టీవర్ట్! మునసబు పంపిన నివేదికలో ఫిబ్రవరి ఒకటో తేదీన ఫితూరీ మొదలవుతోందంటూ వదంతి పుట్టిందని రాశాడు. ఆ ఫిబ్రవరి ఒకటో తేదీనే ఎం.కె.గాంధీ తన సహాయ నిరాకరణోద్యమాన్ని ఉధృతం చేస్తున్నట్టు చెప్పాడు గుర్తులేదా?. ఈ రెండింటికీ అంతుపట్టని సంబంధం ఉందేమోనని అనుమానించాను.'' అంటూ మనసులో మాట చెప్పాడు స్పైర్, గొంతు తగ్గించి.

''నిజమే సుమా!'' అన్నాడు స్టీవర్ట్.

''ఒక్కటి గుర్తుంచుకోండి. ఫజులుల్లాఖాన్, బాస్టియన్– మీరు కూడా వినండి. అవసరమైతే, ఇంకో ఫిర్యాదు ఏది వచ్చినా, కృష్ణదేవిపేటలో ఏ నినాదం వినిపించినా ఈ యువకుడిని మరుక్షణం నర్సీపట్నం పంపండి!'' కటువుగానే అన్నాడు స్పైర్.

## 9

ఎక్కడ నుంచి వచ్చిందో ఆ ఆవేశం– మళ్లీ భారతదేశమంతా 'గాంధీజీకి జై' అంటూ ముక్త కంఠంతో నినదించింది. కృష్ణదేవిపేటలో కూడా ఊహించని పరిణామం. ఫిబ్రవరి 1, 1922.. ఆ మధ్యాహ్నానికే నర్సీపట్నం నుంచి జాతీయ కాంగ్రెస్ కార్యకర్తలు చేరుకున్నారు.

సహాయ నిరాకరణోద్యమాన్ని ఆ రోజు నుంచి మరింత ఉధృతం చేయబోతున్నట్టు గాంధీగారు ముందుగా చేసిన ప్రకటనకు తగ్గట్టే ఉంది దేశంలో వేడి.

''తూర్పు కనుమల






మన్యవీరుడు
అల్లూరి గాథ

వాకిలిలో గాంధీగారి సహాయ నిరాకరణోద్యమనాదం వినిపించడం అపూర్వమే! ఆ ఉద్యమం ఇంత దూరం వచ్చిందంటే, గాంధీగారు దేశప్రజల హృదయాలకు ఎంత చేరువయ్యారో కదా!''

దాదాపు వివశత్వంతో అన్నాడు శ్రీరామరాజు, తన పక్కనే నిలబడి ఉన్న అల్లిపూడి కరణం రాళ్లపల్లి కేశన్నగారితో. ఆయన కరిణీకం వదిలేసి ఈ ప్రాంతంలో ఉద్యమం నడుపుతున్నాడు.

నర్సీపట్నం నుంచి, ఇతర గ్రామాల నుంచి వచ్చిన జాతీయ కాంగ్రెస్ కార్యకర్తలు అరవై మందికి పైగానే ఉన్నారు. అంతా తెల్లటి ఖద్దరు దుస్తులలో ఉన్నారు. భుజాల మీద జాతీయ కాంగ్రెస్ త్రివర్ణ పతాకాలు ఉన్నాయి. వారపు సంత జరిగే చోట ఏర్పాటు చేసిన బహిరంగ సభ అప్పుడే పూర్తయింది. సభాస్థలి నుంచి వారంతా బస చేసిన గ్రామచావడి దగ్గరకి వెళుతున్నారు– నినాదాలు చేసుకుంటూ.

''గాంధీజీకి....''; ''జై!''

''స్వదేశీ.....''; ''మన ఆశయం, మన ప్రాణం!''

''స్వదేశీ విద్య....'';''అసలైన విద్య!''

ఆ నినాదాలు ఉద్వేగానికి గురి చేస్తున్నాయి.

''విదేశీ వస్త్రాలు....'';''మనకొద్దు!''

''మన చేనేత....'';''మన సంపద, మనకి గౌరవం''

''ఖిలీఫాను''; ''పునరుద్ధరించాలి!''

''వందేమాతరం.....'';''మనదే రాజ్యం!''

కృష్ణదేవిపేట అంతా ఉద్యమ నినాదాలతో మారుమోగిపోతోంది.

రెండో తేదీ.... తెల్లవారగట్ట ఐదుగంటలకే ఊరంతా లేచి కూర్చుంది. మామూలుగా ఆ వేళకు పక్క దిగని కుర్రాళ్లు కూడా లేచిపోయారు. చిరు చలిలో వీధులన్నీ నగర సంకీర్తనతో మారుమోగుతున్నాయి. అంతా ఖద్దరు వస్త్రాలు ధరించి, జెండాలతో ఆ చిరుచలిలోనే అప్పటికే పాటలు పాడుతూ తిరుగుతున్నారు. ఏడున్నర గంటలకు మళ్లీ సభ. నగర సంకీర్తన తరువాత అక్కడికి ఊరేగింపుగా వెళుతూ పాట అందుకున్నారు.

'మాకొద్దీ తెల్లదొరతనము– దేవ... మాకొద్దీ తెల్లదొరతనము.

మా ప్రాణాలపై పొంచి- మానాలు
హరియించె..
మాకొద్దీ తెల్లదొరతనము
పన్నెండు దేశాలు-పండుచున్నాగాని
పట్టెడన్నమె లోపమండి!
ఉప్పు! ముట్టుకుంటే దోషమండి
నోట! మట్టికొట్టిపోతాడండి
అయ్యో! కుక్కలతో పోరాడి-కూడు
తింటామండి....... !!మాకొద్దీ!!

మద్రాసు ప్రెసిడెన్సీలో చాలా గ్రామాలని ఈ గేయం ఉ[ద్రూతలూగిస్తోంది. స్టెన్సిల్స్ తీసి అమ్ముతున్నారు అణాకి. కళ్ల ముందు జరుగుతున్న చీరాల-పేరాల ఘటన, పల్నాడు, పెదనందిపాడు పన్నుల సత్యాగ్రహం అన్నీ ఆ గేయంతో పరిచయం చేసేశాడు కవి.

అంతలోనే పోలీసులు వస్తున్నట్టు కబురు. కార్యకర్తలు హడావుడిగా సామాను సర్దుకుని నర్సీపట్నం వెళ్లిపోయారు.

## 10

మూడో తేదీ ఉదయం ఎనిమిదిగంటల వేళ...

ఫజులుల్లా ఖాన్ ఆరుగురు పోలీసులతో హఠాత్తుగా రామాలయం దగ్గరకు వచ్చి, రామరాజును తీసుకుని వెంటనే రావలసిందని మునసబుకు కబురు పెట్టాడు. పోలీసులను పంపించి గ్రామ పెద్దలను కూడా అక్కడకు రప్పించారు.

''ఆర్డర్ చూపించు!'' అప్పుడు ఆదేశించాడు ఫజులుల్లాఖాన్.

భాస్కరుడికీ, స్వామినాయుడికీ, రామరాజుకీ ఆర్డర్ నకళ్లు ఇచ్చాడు కానిస్టేబుల్.

''రామరాజుగారూ! ఏమిటిది?'' అన్నాడు స్వామినాయుడు కంగారు పడుతూ.

''రంప ఏజెన్సీ సబ్ డివిజినల్ ఫస్ట్‌క్లాస్ మేజిస్ట్రేట్ వారి ఆదేశం. భారతీయ శిక్షా స్మృతి ప్రకారం కృష్ణదేవిపేట గ్రామంలో 144వ సెక్షన్ విధించారు.'' అన్నాడు రామరాజు, ఏమీ ఆశ్చర్యపడకుండా.

''రామరాజుగారు! మిమ్మల్ని నిర్బంధంలోకి తీసుకుంటున్నాం. అయితే ఇది అరెస్టు కాదు. ఇంటర్న్‌మెంట్. పొలిటికల్ సస్పెక్ట్‌గా తీసుకురమ్మని ఆదేశం. మాతో నర్సీపట్నం రావాలి!'' అన్నాడు ఫజులుల్లా ఖాన్.



*''హలో... నర్సీపట్నం హెడ్‌క్వార్టర్స్... ఓవర్...!'' ఆ గొంతు విని, చటుక్కున ముందుకు వచ్చాడు ఫర్బేస్.*

*''హలో.... హలో...కేడీపేట క్యాంప్.....ఈవ్‌లింగ్... నువ్వేనా? హలో... ఏమిటి? ఇక్కడ నుంచి ఆ సమాచారం పంపేందుకు ప్రయత్నించమంటావా? ఓవర్'' అన్నాడు ఫర్బేస్.*

***''అదే మంచిది. చూడు, రామరాజుని మంపలో అరెస్టు చేశారు. అక్కడ నుంచి నేరుగా కేడీపేట తీసుకువచ్చి స్పెషల్ ఆఫీసర్‌కే అప్పగించాలి. ఈ ఆదేశంలో ఒక్క అక్షరం మారకూడదు. ఈ విషయమే కొయ్యూరు వాళ్లకి కచ్చితంగా చెప్పాలి. ఓవర్.''***



# ఐదవ అధ్యాయం

## 1

నర్సీపట్నం సబ్ జైలులో రెండో నంబర్ సెల్.

త్రయంబకేశ్వరం పేరు చెప్పగానే స్వేనీ ముఖంలో పొటెత్తిన కంగారూ, ఫజులుల్లా మాటలలో వచ్చిన ఆటుపోట్లూ పదే పదే గుర్తుకు వస్తున్నాయి రామరాజుకి.

గోదావరి పుట్టిన ఆ పుణ్యక్షేత్రానికి వెళ్లానంటూ తను ఇచ్చిన వాగ్మూలం ఆ ఇద్దరు బ్రిటిష్ సేవకులను కొంచెం కూడా నమ్మించదని రామరాజుకు తెలుసు. అదీ ఆ స్థల మహత్యం.

నాసికా త్రయంబకం ....

త్రయంబకేశ్వరం....

రాజమండ్రిలో తండ్రి నడిపిన స్టూడియోలో మాయాలాంతరు బొమ్మలు చెప్పిన కథలలోనే మొదటిసారి ఆ పేర్లు విన్నాడు రామరాజు.

ఓ పచ్చటి కొండ, దాని మీద నుంచి జారే నాలుగైదు ధారలు. అదే గోదావరి. ఆ సన్నటి ధార రాజమండ్రి చేరేసరికి అఖండ గౌతమిగా, మూడు మైళ్ల వెడల్పుతో విశ్వరూపం దాలుస్తుందని అప్పుడే విన్నాడు రామరాజు. అక్కడ నుంచి దిగువకు ధవళేశ్వరం వెళ్లి, పాయలుగా చీలి, అందులో ఒకటి అంతర్వేది దగ్గర సముద్రంలో కలుస్తుందని కూడా తెలుసుకున్నాడు.

సెల్ అంతటా చీకట్లు ఆవరించుకున్నాయి. ఆవరణ అంతా నిశ్శబ్దంగా ఉంది. అర్ధరాత్రి దాటింది.

జూన్‌లో కృష్ణదేవిపేట నుంచి బయలుదేరిన రామరాజు వర్షాలు ముమ్మరమయ్యే నాటికి త్రయంబకం చేరుకున్నాడు. జ్ఞాపకం వెంట జ్ఞాపకం మాయలాంతరులోని దీపంలా జ్వలించడం మొదలుపెట్టాయి. ఏవేవో దృశ్యాలు కదిలిపోతున్నాయి. దృష్టిపథంలో వీటన్నిటినీ అధిగమిస్తూ, నిన్న మొన్నటి తన త్రయంబక యాత్రాస్మృతి ఒక వరదలా ముంచెత్తుతోంది......

నిత్యం వేకువనే గోదావరి జన్మస్థలం బ్రహ్మగిరి ముందే నిలబడి చేతులెత్తి నమస్కరించేవాడు రామరాజు.

త్రయంబకేశ్వరం అడుగడుగూ ప్రకృతి సౌందర్యమే. అక్కడక్కడ రుద్రాక్ష చెట్లు సహా,

● డా. గోపరాజు నారాయణరావు

రకరకాల మహావృక్షాలు. వాటి మధ్య ఎన్నో తీర్థాలు. ఆ తీర్థాల ఒడ్డునే రమణీయ శిల్పకళతో ఎన్నో ఆలయాలు. వాటన్నిటికీ తలమానికంగా ఉంటుంది నల్లని రాతితో కట్టిన త్రయంబకేశ్వరాలయం. గౌతముడు తన కోసం గోదావరిని అక్కడ ఆపాడని స్థలపురాణం. గోదావరి సరే, రామలక్ష్మణ తీర్థం, గౌతమ తీర్థం, విశ్వనాథ తీర్థం, బిల్వతీర్థం, ఇంద్రతీర్థం, నీలాంబరతీర్థం, ప్రయాగ తీర్థం... ఇంకా ఎన్నో!

వీటిని చుట్టుకుని ఎన్నెన్నో స్థలపురాణాలు, గాథలు, కథలు! రామరాజుకు బస ఏర్పాటు చేసిన క్షేత్రోపాధ్యాయుడు (అక్కడి పురోహితులని క్షేత్రోపాధ్యాయులంటారు. వారికి పెద్ద పెద్ద ఇళ్లుంటాయి. వాటిలో భక్తులకు బస కల్పిస్తారు) అవన్నీ చెబుతూ ఉండేవాడు.

బ్రహ్మగిరి, హరిహరగిరులకు ప్రదక్షిణలు చేస్తున్నా, పాండవుల గుహలు, జైనుల మందిరాలు తిరుగుతున్నా ఎన్నో పురాణ కథలు చెవులలో ప్రతిధ్వనిస్తూ ఉండేవి. తనువు పులకరింప చేసే ఎన్నో శ్లోకాలు విన్నాడు. అన్నీ ఆ నేల ప్రాశస్త్యాన్ని చాటేవే!

ఆ మంత్రాలతో పాటే జనమంతా తరతమ భేదం లేకుండా వల్లించే మరో మంత్రం రామరాజు చెవులను తాకేది. అది – వందేమాతరం.

మరో ఘట్టం వివరం కూడా తరచుగా అతడి చెవిని తాకుతూ ఉండేది.

గోదావరికి బ్రహ్మగిరి జన్మనిచ్చినట్టు, అక్కడ వందేమాతర మంత్రానికి జన్మనిచ్చినది ఆ ఘట్టమే.

పదిహేనేళ్ల క్రితమే జరిగిన ఆ ఘట్టంలో తన వంతు నిర్వహించిన పాత్రను చూసుకుని త్రయంబకం కూడా గర్వపడుతూ ఉంటుందనిపిస్తుంది .....

ఆగస్ట్ 26, 1906.

బాలగంగాధర తిలక్ నాసిక్ వచ్చాడు. అంతకు ముందుటేడు జరిగిన బెంగాల్ విభజనలో శ్వేతజాతి పాలకులు ఎంత ద్రోహబుద్ధిని ప్రదర్శించారో చెప్పడానికే వచ్చాడు. అప్పుడే ఆవిర్భవించింది అభినవ భారత్ సంస్థ. విభజనతో జ్వలించిన ఆగ్రహాన్ని ఉద్యమరూపంలోకి మార్చే ప్రయత్నం మొదలుపెట్టారు. అందులో చాలామంది నాసిక్‌కు తూర్పు దిశగా ఉన్న ఔరంగాబాద్ లేదా దేవగిరి కేంద్రంగా పనిచేస్తున్న మిత్రమేళా అనే రహస్య సంస్థ సభ్యులే.

మిత్రమేళా ఆశయం అందరికీ తెలుసు- కన్నుకు కన్ను. తెల్లజాతి విషయంలో ఇదే సత్యం. అనుసరణీయం. చేయవలసింది యుద్ధం.

అందుకు ఆయుధాలను సేకరించాలి. భారత్‌ను చెరబట్టిన బ్రిటిష్ పాలకుల మీద ఎక్కుపెట్టాలి.

ఈ కార్యక్రమం, ప్రణాళికల వెనుక ఉన్నవారు ముగ్గురు సోదరులు. వారిలో పెద్దవాడు చదువుకోసం ఇంగ్లండ్ వెళ్లిపోతున్నప్పుడు, 1906 జూన్‌లో ఒక రహస్య ప్రదేశంలో, మారుమూల తీసుకున్న ఫొటో. ఇప్పటికీ నాసిక్, త్రయంబకాలలో చాలా ఇళ్లలో కనిపిస్తుంది. రామరాజు బస చేసిన క్షేత్రోపాధ్యాయుడి ఇంట్లో కూడా ఉంది. తమ నాయకుడి చుట్టూ నిలబడి మిత్రమేళా సభ్యులు కొందరు తీయించుకున్న ఫొటో అది. వారి చేతులలో శివాజీ మహరాజ్ చిత్రపటాలు, వాటి కింద వందేమాతరం నినాదం. ఆ నాయకుడు వినాయక్ దామోదర్ సావర్కర్.

నాసిక్ కలెక్టర్ జాక్సన్ అణచివేత మొదలుపెట్టాడు. అభినవ్ భారత్ సభ్యులంటే చాలు చిత్రహింసలతో జీవచ్ఛవాలను చేయించాడు. సహజంగానే ఇతడు మిత్రమేళాకు లక్ష్యంగా మారి, చావును ముందుకు తెచ్చుకున్నాడు.

డిసెంబర్ 21, 1909.... ఆ రోజు అనుకోకుండా జరిగిపోయింది. నాసిక్‌లోనే విజయానంద నాటకశాలలో శారద అనే నాటకం చూస్తున్నాడు జాక్సన్. అనంత్ కన్హేరే అనే మిత్రమేళా సభ్యుడికి ఈ సంగతి తెలిసింది. నాటకశాలకు వెళ్లి రివాల్వర్‌తో కాల్చేశాడు. కన్హేరే సహా ముగ్గురిని ఉరి తీశారు.



‘మరి... నేను అఖండంగా దర్శనమిచ్చే రాజమండ్రి తీరంలో చిన్నతనంలో నువ్వు కూడా చూసిన ఆ ఘట్టం గుర్తు లేదా ఏమిటి!’ అని అప్పుడప్పుడు నదీముఖం నవ్వుతూ అడిగినట్టనిపించేది. అప్పుడు ఆ ఘటనల గురించి ఆ జలపాతంతో మాటామంతీ జరిపేది తన బాల్యం..........

‘వందేమాతరం’ అంటూ తెలుగు, దేవనాగరి, ఉర్దూ లిపులలో రాసిన ఆ బ్యానర్ గోదావరి గాలికి రెపరెపలాడడం ఇప్పటికీ గుర్తే, రామరాజుకి.

ఆ ఇన్నిస్‌పేటలోనే జవ్వాదివారి కొట్లలో ఉంది వెంకటరామరాజు ఫొటో స్టూడియో. ఆ రెండు రోజులు శ్రీరామరాజు అక్కడ జరిగిన ఏర్పాట్లన్నీ కన్నార్పకుండా చూశాడు.

‘19-4-1907- రాజమండ్రి’

ఆ అంకెలూ, ఆ ఇంగ్లిష్ అక్షరాలూ చూసేసి, డబ్బు తీసుకుని దాదాపు విసిరేస్తున్నాడు అతడు టికెట్లు.

అన్నీ ప్లాట్‌ఫారమ్ టికెట్లే.

ఒక్కసారిగా వచ్చి పడ్డారు జనం. రాజమండ్రి రైల్వేస్టేషన్ టికెట్ కౌంటర్‌లో కూర్చున్న ఆ తెల్లజాతి ఉద్యోగికి సంభ్రమంగా ఉంది. భయంగా కూడా ఉంది. ఎవరో గత రాత్రి స్టేషన్ లోపలి గోడల మీద తాటికాయలంత ప్రమాణంలో; తెలుగు, ఇంగ్లిష్‌లలో ఆ నినాదాలు అందంగా లిఖించారు- ‘వందేమాతరం’... అంటూ.

తోసుకు తోసుకు వస్తున్నారు జనం. అన్నీ ప్లాట్‌ఫారమ్ టికెట్లే. కిటకిటలాడిపోతోంది ప్లాట్‌ఫారమ్.

స్టేషన్ బయట ఇంకో రెట్టింపు జనం.

రైళ్లు వచ్చి ఆగే చోటకు కొంచెం ఇవతల నిలబడి ఉన్నారు రాజమండ్రి ప్రముఖులు, ఇతర ప్రాంతాల నుంచి వచ్చిన పెద్దలు, స్టేషన్‌లో.

**తెల్లటి పంచె, లాల్చీ, తలపై తెల్లటి పాగా ధరించిన ఆ ధీర గంభీర వదనుడు మొదట కింద అడుగుపెట్టారు. ఆయన ముట్నూరి కృష్ణారావు. కృష్ణాపత్రిక ఎడిటర్. వెంటనే వెనుదిరిగి, దిగుతున్న ఆ వ్యక్తికి చేయి అందించారు.**
**పేరు కృష్ణారావే అయినా, రథం దిగుతున్న గీతాచార్యుడికి చేయి అందిస్తున్న అర్జునుడిని గుర్తు చేస్తున్నారు ముట్నూరి వారు.**

తనకు ఎదురుగా చేతులు జోడించి సవినయంగా నిలబడి ఉన్న ఆయన భుజాలు ఆప్యాయంగా రాస్తున్నారు- పంచె, చొక్కా, పైన నల్లని కోటుతో, తల మీద తెల్లని తలపాగాతో ఉన్న ఆ పెద్దాయన. తెల్లటి బొద్దు మీసాలు హుందాతనం ఇస్తున్నాయి. వారే చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులుగారు. అప్పటికే చూపు పోయిందాయనకి. చేతులు జోడించి నిలబడి ఉన్న వారే సత్యవోలు గున్నేశ్వరరావు. రాజమండ్రి కరణం. ఇంతకాలం జాతీయోద్యమానికి రహస్యంగా అండదండలు ఇచ్చినవారే కరణంగారు. ఇప్పుడు బాహాటంగా ముందుకు వచ్చారు. ఆ ఇద్దరికీ కొంచెం దగ్గరగా నిలబడి ఉన్నాడు, ఓ యువకుడు. పేరు గాడిచర్ల హరిసర్వోత్తమరావు. రాజమండ్రి ప్రభుత్వ ఉపాధ్యాయ శిక్షణ కళాశాలలో విద్యార్థి. విద్యార్థి నాయకుడు. గాడిచర్ల వెనుకే దండ పట్టుకుని మరో యువకుడు నిలబడి ఉన్నాడు. అతడు మునగాల రాజా నాయని వెంకటరంగారావు. కొత్తా శ్రీరామశాస్త్రి, దంటు సుబ్బావధాని, డాక్టర్ బ్రహ్మజోశ్యుల సుబ్రహ్మణ్యం, యర్రమిల్లి జగన్నశాస్త్రి, గోటేటి వెంకటరావు... అంతా అక్కడే ఉన్నారు. వారంతా మొన్న డిసెంబర్‌లో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ సమావేశాల కోసం కలకత్తా వెళ్లివచ్చినవారే. వందేమాతర గేయాన్ని జాతీయగీతంగా స్వీకరించాలని, స్వదేశీ ఉద్యమం ప్రారంభించాలని ఆ సభలో చేసిన తీర్మానాలు ఉద్యమిస్తున్న భారతీయులకి కొత్త రక్తాన్ని అందించినట్టయింది.

చిలుకూరి వీరభద్రరావుగారు ఏదో చెబుతుంటే బాలభారతి సమితి నాయకులు టంగుటూరి శ్రీరాములు, గంటి లక్ష్మన్న, కంచుమర్తి రామచంద్రరావు వంటి వారు దీక్షతో వింటున్నారు.

ఈ కార్యక్రమం నిర్వహిస్తున్న బాలభారతి సమితి సభ్యులు కొందరు కలకత్తా జెండాలు పట్టుకుని నిలబడ్డారు. కొందరి చేతులలో ప్లకార్డులు.

కలకత్తా జెండా-దీర్ఘచతురస్రాకారంగా, మూడు రంగులతో రూపుదిద్దుకుంది.

పైన ఎరుపు. ఈ భాగంలోనే సగం విచ్చుకున్న ఎనిమిది పద్మాలను వరసగా చిత్రించారు.

మధ్యన పసుపు వర్ణం. దీని మీదే దేవనాగరి లిపిలో నల్లటి రంగుతో ‘వందేమాతరం’ అని రాశారు.

కింది భాగంలో ఆకుపచ్చ రంగు. ఎడమవైపున సూర్యుడి బొమ్మ, కుడి వైపున చంద్రవంక ముద్రించారు.

నిరుడు కలకత్తాలో పార్సీ బగాన్ స్క్వేర్‌లో ఆవిష్కరించారు. అందుకే కలకత్తా జెండా అంటున్నారు.

అప్పుడే దూరంగా రైలుకూత వినిపించింది. రెండు నిమిషాల తరువాత స్టేషన్‌లోకి దూసుకొచ్చింది రైలు. అంతా అటు పరుగు తీశారు.

తెల్లటి పంచె, లాల్చీ, తలపై తెల్లటి పాగా ధరించిన ఆ ధీర గంభీర వదనుడు మొదట కింద అడుగుపెట్టారు. ఆయన ముట్నూరి కృష్ణారావు. కృష్ణాపత్రిక ఎడిటర్. వెంటనే వెనుదిరిగి, దిగుతున్న ఆ వ్యక్తికి చేయి అందించారు.

పేరు కృష్ణారావే అయినా, రథం దిగుతున్న గీతాచార్యుడికి చేయి అందిస్తున్న అర్జునుడిని గుర్తు చేస్తున్నారు ముట్నూరి వారు. ఆ చేతిని ఆప్యాయంగా అందుకుని, చిరునవ్వుతో కిందికి దిగారా వ్యక్తి కూడా. సన్నటి పొడవైన మనిషి. ఆపాదమస్తకం బెంగాలీ ముద్ర. మధ్య పాపిడి, కళ్లకి నాజూకైన గుండ్రటి సులోచనాలు, తెల్లటి పంచె, లాల్చీ, పైన వల్లెవాటుగా వేసుకున్న కశ్మీర్ శాలువా. ఆయన బిపిన్ చంద్రపాల్.

ఆయనను చూడగానే ఒక్క పెట్టున నినాదాలు వినిపించాయి ‘వందేమాతరం’ అంటూ.

రైలు ఇంజన్ శబ్దం చిన్నబోయేటట్టు మారుమోగుతూనే ఉన్నాయి నినాదాలు

‘‘వందేమాతరం....’’, ‘‘వందేమాతరం....’’, ‘‘వందేమాతరం....’’

*(తరువాయి భాగం వచ్చేవారం)*

• పాటతత్త్వం

# యాతమేసి తోడినా...



**జాలాది**
గీత రచయిత

**‘ప్రాణం ఖరీదు’ చిత్రంలోని జాలాది రచించిన ‘యాతమేసి తోడినా...’ పాటపై జయరాజ్ అనుభూతులు ఆయన మాటల్లోనే...**

జాలాది రాసిన ఈ పాటలో అమ్మతనం , ప్రేమ, అనురాగాలు అణువణువునా కనిపిస్తాయి. కోటానుకోట్ల ప్రజలను తన వెంట తీసుకుని సూర్యుని చుట్టూ తిరిగి రావడంలో పుడమిలో అమ్మతనం కనిపిస్తుంది. అమ్మ చనుబాల ఋణం తీర్చుకోలేనిది. స్త్రీ ఒక బిడ్డను కని బలహీనమైనప్పటి నుంచి పురుషుడి ఆధిక్యత, స్త్రీ మీద పెత్తనం ప్రారంభమయ్యాయి. మారిన ఈ సమాజంలో అమ్మతనం, మాతృత్వం తెలిపే పాట, మనందరికీ ప్రాణమైన అమ్మ గురించి తెలిపే పాట.

**యాతమేసి తోడినా ఏరు ఎండదు/ పొగిలి పొగిలి ఏడ్చినా పొంత నిండదు/ దేవుడి గుడిలోదైనా పూరిగుడిసెలోదైనా/ గాలి ఇసిరి కొడితే.../ ఆ దీపముండదు... ఆ దీపముండదు...**

ఎంతో వేదాంతాన్ని ప్రబోధించే పాట ఇది. దీపం దేవుడి గుడిలో వెలిగించినా, పూరి గుడిసెలో వెలిగించినా, పెనుగాలి వీస్తే ఆ దీపం కొండెక్కుతుంది. భగవంతుడి దృష్టిలో అందరూ ఒక్కటే. ఆయనకు పెద్దా, చిన్నా తేడా లేదు... అని ఈ పల్లవిలో చెప్పారు జాలాది.

అలా రాస్తూ రాస్తూ...




**పలుపు తాడు మెడకేస్తే పాడియావురా/ పసుపు తాడు ముడులేస్తే ఆడదాయిరా.../ కుడితి నీళ్లు పోసినా... అది పాలు కుడుపుతాది/ కడుపు కోత కోసినా... అది మనిషికే జన్మ ఇత్తాది/ బొడ్డు పేగు తెగి పడ్డ రోజు తెలుసుకో/ గొడ్డు కాదు ఆడదనే గుణం తెలుసుకో...**

అంటారు.

పలుపుతాడు మెడకేస్తే పాడియావురా పసుపు తాడు ముడులేస్తే ఆడదాయిరా... అని స్త్రీని వర్ణించిన అద్భుతమైన ఈ పాట విన్నప్పుడల్లా గుండె బద్దలవుతుంది. నాకు ఇష్టమైన పాట. మధురమైన పాట. నేను మర్చిపోలేని పాట.



**జయరాజ్**
ప్రజాకవి

**అందరూ నడిచిన తోవ ఒక్కటే/ చీము నెత్తురులు పారే తూము ఒక్కటే/**

భగవంతుడి సృష్టిలో మనమందరం సమానమే. అందరం నడిచే మార్గం ఒకలాగే ఉంటుంది. పేదలకు ఒక తోవ, సంపన్నులకు ఒక తోవ ఉండదు. అదేవిధంగా అందరిలోనూ చీము నెత్తురులు ప్రవహించే మార్గం ఒక్కటే అంటూ ఎంతో వేదాంతాన్ని బోధించారు జాలాది ఈ చరణంలో. భగవంతుడి దృష్టిలో అందరూ సమానమేననే భావం ఈ పాటలో ప్రస్ఫుటంగా కనపడుతుంది. జాలాది ఈ పాటలో ఎంతో వేదాంతాన్ని ప్రబోధించారు. పదికాలాల పాటు మనసులో నిలబడే పాట, అందరి మనసులనూ హత్తుకునే పాట. నాకు ఎంతో ఇష్టమైన పాట.

– సంభాషణ: **డా. వైజయంతి**

---

• ఉత్తమ విలన్

# ఖతర్నాక్...కాలకేయ!





ప్రభాకర్

**వెం**డితెర అద్భుతం ‘బాహుబలి’లో బాహుబలి, భల్లాలదేవలు ఎలా గుర్తుండి పోతారో కాలకేయుడు కూడా అలాగే గుర్తుండి పోతాడు. అతడు మాట్లాడిన ‘కిలికి’ భాష కూడా అలాగే గుర్తుండి పోతుంది. నల్లరాతి కొండలాంటి దృఢమైన శరీరం, చింత నిప్పులాంటి కళ్లు...ఈ భయానక ఆహార్యానికి తోడు భయంకరమైన కంఠంతో వెన్నులో చలి పుట్టించాడు కాలకేయుడు. ‘ప్రభాకర్’ అనే పేరు పెద్దగా తెలియకపోవచ్చుగానీ, ‘కాలకేయుడు’ అనే పేరు దేశవ్యాప్తంగా ఎంతోమంది ప్రేక్షకులకు తెలుసు! ఎవరీ ప్రభాకర్!

మహబూబ్‌నగర్ జిల్లా హస్నాబాద్‌కు చెందిన ప్రభాకర్ స్వభావరీత్యా సిగ్గరి. క్రికెట్ ఆడడం తప్ప సినిమాల్లో నటించాలని ఎప్పుడూ అనుకోలేదు. నటిస్తాను అని ఎప్పుడు భవిష్యవాణిని అంచనావేయలేదు. మాంచి ఒడ్డూ పొడుగు ఉన్న ప్రభాకర్‌ను చూసి బంధువు ఒకరు...

‘‘హైదరాబాద్‌కు వచ్చేయ్... రైల్వేలో కానిస్టేబుల్ ఉద్యోగం ఇప్పిస్తాను’’ అన్నాడు. అయితే ఆరు సంవత్సరాలు గడిచినా అలాంటిదేమీ జరగలేదు. మహేష్‌బాబు ‘అతిథి’ సినిమా షూటింగ్‌కు వెళ్లినప్పుడు అనుకోకుండా ఆ సినిమాలో చిన్న పాత్రలో నటించే చాన్సు వచ్చింది ప్రభాకర్‌కు. ‘మగధీర’ సినిమా కోసం నటులను వెదుకుతున్నప్పుడు డైరెక్టర్ రాజమౌళిని కలిశాడు ప్రభాకర్. ఆయన ఏమీ చెప్పలేదు. అయితే తనతో పాటు రాజస్తాన్‌కు తీసుకువెళ్లాడు. అక్కడ ‘మగధీర’ షూటింగ్ జరుగుతోంది. రాజస్తాన్‌లో ప్రభాకర్‌ను గమనించారు రాజమౌళి. తిరిగి హైదరాబాద్‌కు వచ్చిన తరువాత మళ్లీ ఉద్యోగ వేటలో పడ్డాడు ప్రభాకర్. ఒకరోజు రాజమౌళి నుంచి పిలుపు వచ్చింది. ‘మర్యాద రామన్న’ సినిమాలో ఒక వేషం ఇస్తున్నట్లు చల్లని కబురు చెవిలో వేశారు రాజమౌళి.

చా...లా గొప్ప చాన్స్... కానీ తనకు నటన అంతగా రాదు... ఇదే విషయాన్ని రాజమౌళితో చెప్పాడు ప్రభాకర్. ‘ఫరవాలేదు’ అంటూ దేవదాస్ కనకాల దగ్గర శిక్షణ ఇప్పించడమే కాకుండా, నెలకు పదివేలు స్టైపెండ్ కూడా ఇచ్చారు రాజమౌళి.

‘మర్యాద రామన్న’ సినిమాలో వేసిన బైరెడ్డి పాత్రతో ఇక వెనక్కి తిరిగి చూసుకోవాల్సిన అవసరం రాలేదు. ఆ సినిమాకు వచ్చిన రెమ్యునరేషన్‌తో అప్పులన్నీ తీర్చేశాడు. ఇక ‘బహుబలి’ సినిమాలో వేసిన కాలకేయుడి వేషం ప్రభాకర్‌ని ఎక్కడికో తీసుకువెళ్లిపోయింది. ఈ సినిమాలో ఉపయోగించిన ‘కిలికి’ భాష కోసం రోజూ తెల్లవారుజామున మూడు గంటలకు లేచి ప్రాక్టీస్ చేసేవాడు ప్రభాకర్. ఇది మాత్రమే కాదు... కాలకేయుడిగా ప్రేక్షకులను భయపెట్టడానికి ఎన్ని రకాలుగా కష్టపడాలో అన్ని రకాలుగానూ పడ్డాడు. ఆ కృషి వృథా పోలేదు... అని కాలకేయుడి పాత్రకు వచ్చిన స్పందన చెప్పకనే చెప్పింది. •

## • సాల్వ్ చేస్తారా? శీర్షాసనమేస్తారా?

### • మాయా బజార్

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | ■ | 4 |
| | ■ | | ■ | | ■ | |
| 5 | 6 | ■ | 7 | | | ■ |
| ■ | | ■ | ■ | | ■ | ■ |
| 8 | | 9 | | ■ | 10 | ■ |
| | ■ | | ■ | ■ | 11 | |
| | ■ | 12 | | | | ■ |

**అడ్డం:**

1. కె.విశ్వనాథ్ దర్శకత్వంలో వెంకటేశ్, భానుప్రియ జంటగా నటించిన ఈ చిత్రానికి ఇళయరాజా సంగీతం సమకూర్చారు (5)
5. సునీల్‌కుమార్ రెడ్డి దర్శకత్వంలో సాయిధరమ్ తేజ్, మన్నార్ చోప్రా జంటగా నటించిన సినిమా. ఈ చిత్రానికి తమన్ సంగీతం సమకూర్చారు. పేరు అటు నుంచి (2)
7. సునీల్ వర్మ దర్శకత్వంలో సుమన్, లీజ జంటగా నటించిన ఈ సినిమాకు యం.యం.కీరవాణి సంగీతం సమకూర్చారు. చివరి అక్షరం మిస్ అయింది (3)
8. బాలీవుడ్ సినిమా 'లవ్ ఆజ్ కల్'కు రిమేక్‌గా వచ్చిన ఈ సినిమాలో పవన్ కళ్యాణ్, త్రిష జంటగా నటించారు. త్రివిక్రమ్ సంభాషణలు రాశారు. పేరు అటు నుంచి (4)
11. మార్షల్ ఆర్టిస్ట్, డైరెక్టర్, స్టంట్ కో–ఆర్డినేటర్, కోరియోగ్రాఫర్‌గా చేసిన మంజునాథన్ కుమార్.... 'థ్రిల్లర్'...గా ప్రసిద్ధుడు (2)
12. 'శ్రుతిలయలు' సినిమాలో కథానాయిక (4)

**నిలువు:**

1. తమ్మారెడ్డి భరద్వాజ దర్శకత్వంలో రోజా టైటిల్ రోల్ పోషించిన సినిమా (3)
2. మల్లికార్జున్ దర్శకత్వంలో కళ్యాణ్‌రామ్, సనాఖాన్, శరణ్యమోహన్ జంటగా నటించిన ఈ సినిమాకు మణిశర్మ సంగీతం సమకూర్చారు (2)
3. తాతినేని ప్రసాద్ దర్శకత్వంలో బాలకృష్ణ, భానుప్రియ జంటగా నటించిన ఈ చిత్రం బాలీవుడ్ సినిమా 'కర్జ్'కు రీమేక్. కింది నుంచి (4)
4. శోభన్‌బాబు, రాధిక జంటగా నటించిన ఏవీయం వారి చిత్రం. రాజాచంద్ర దర్శకత్వం చేసిన ఈ చిత్రానికి చక్రవర్తి సంగీతం, వేటూరి సాహిత్యం అందించారు (2)
6. 'ఈరోజుల్లో' 'బస్‌స్టాప్' 'కొత్త జంట' 'భలే భలే మగాడివోయ్' చిత్రాల దర్శకుడు. 'ప్రేమ కథా చిత్రమ్' సినిమాకు నిర్మాత. పేరు కింది నుంచి (3)
8. 'నోటంకీ నోటంకీ' పాట ఉన్న రవితేజ సినిమా. కింది నుంచి (3)
9. 'నేటి భారతం' 'సితార' 'ముసుగు దొంగ' 'గర్జన' 'దొంగల్లో దొర' 'పెద్దింటి అల్లుడు' సినిమాల హీరో. రజనీకాంత్ 'శివాజీ' సినిమాలో విలన్‌గా చేశారు. దిగువ నుంచి (3)
10. 'ఏం మాయ చేశావే' 'దూకుడు' 'ఈగ' 'అత్తారింటికి దారేది' 'అల్లుడు శ్రీను' 'ఆటోనగర్ సూర్య' చిత్రాల కథానాయిక (3)

### • మైథోగ్రఫీ

1. రామభక్తురాలు.



2. పై జవాబులో మొదటి అక్షరంతో నూరు యజ్ఞాలు చేసిన ఇంద్రుడు.



3. పై జవాబులో '3'వ అక్షరంతో... ఒక అప్సరస.



4. పాండవులలో ఒకరు. పై జవాబులో '4'వ అక్షరంతో...



5. నాల్గవ జవాబులో '2'వ అక్షరంతో విష్ణువు పేరు.



### • బ్రెయిన్ జిమ్

1. మీ పెదాల మీద నవ్వు తెప్పించగలను. మీ కళ్లలో నీళ్లు తెప్పించగలను. కానీ కనిపించను.
2. చావులో ఉండే రణం.
3. సంతలన్నీ తిరుగుతాడు. సమానంగా పంచుతాడు.
4. వంక కాని వంక.

| | | | | |
|---|---|---|---|---|
| ల | జ్ఞా | ప | కం | సు |
| అ | న | మ | చి | ర |
| మ | ర | ణం | న | ట |
| వ | జ | క | వ | త్రా |
| గో | రు | వం | క | సు |

### జవాబులు

**• మాయా బజార్**

**అడ్డం:** 1. స్వర్ణకమలం 5. తిక్క 7. ఆత్మబం(ధం) 8. తీన్‌మార్ 11. మంజు 12. సుమలత

**నిలువు:** 1. స్వర్ణక్క 2. కత్తి 3. ఆత్మబలం 4. బంధం 6. మారుతి 8. పవర్ 9. సుమన్ 10. సమంత

**• మైథోగ్రఫీ**

1. శబరి 2. శతమఖుడు 3. మదాలస 4. సహదేవుడు 5. హరి

**• బ్రెయిన్ జిమ్**

| | | | | |
|---|---|---|---|---|
| ల | జ్ఞా | ప | కం | సు |
| అ | న | మ | చి | ర |
| మ | ర | ణం | న | ట |
| వ | జ | క | వ | త్రా |
| గో | రు | వం | క | సు |

### • కిసుక్కు



సోంబాబు: నిన్న ఇంట్లో మా ఆవిడకి, నాకూ పెద్దవాదన అయిందిలే. సినిమాకని తను, పార్కుకు అని నేను...

రాంబాబు: సర్లే. సినిమా ఎలా వుందో చెప్పు.

– కె.ఎస్.రెడ్డి., గొల్లలమామిడాడ

### • మీకు తెలుసా





పండు పండు పండూ... అరటి పండు. అరటి పండ్లలో 100 రకాల వెరైటీలు ఉన్నాయి!

## పదశోధన - 431

నిర్వహణ : **అదృష్టదీపక్**

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | ■ | 4 | | 5 | ■ | 6 |
| | ■ | 7 | | 8 | | ■ | 9 | | |
| | ■ | | ■ | | ■ | 10 | | ■ | ■ |
| 11 | | | 12 | ■ | 13 | | | ■ | 14 |
| | ■ | 15 | | 16 | ■ | 17 | | | |
| ■ | 18 | ■ | ■ | 19 | 20 | | | | |
| 21 | | | | | | ■ | 22 | | |
| ■ | | ■ | ■ | | | 23 | | ■ | |
| 24 | | | 25 | ■ | 26 | | ■ | 27 | |
| | ■ | ■ | 28 | | | ■ | 29 | | |

**ఆధారాలు**

**అడ్డం**

1. వెండితెరను ఏలిన గయ్యాళి అత్త (4)
4. ప్రేమనగర్ కథానాయిక (3)
7. నేర్పరి, చాతుర్యం కలవాడు (4)
9. దయ కలిగిన కత్తి (3)
10. ఐదు నిలువులో దాగిన ద్రౌపది (2)
11. రాజుగారి తల్లి (4)
13. క్లుప్తంగా తిరుమల తిరుపతి దేవస్థానం (3)
15. 'ల' ద్వయంతో స్త్రీ (3)
17. నిద్ర, శయనం (4)
19. అటు నుంచి పూచిన శిలాపుష్పం (4)
21. 'వటపత్రశాయికి' స్వాతిముత్యంలో పాట (6)
22. సాగిన యత్నం (3)
23. చర్మం (3)
24. చిత్తూరు జిల్లాలో ప్రసిద్ధ వినాయక క్షేత్రం (4)
26. సన్నని చెక్క, వంట కట్టె (2)
27. అక్క మగడు (2)
28. పిట్ట (3)
29. సరస్వతి (3)

**నిలువు**

1. శిలతో కలిసిన అయస్కాంతం (5)
2. మతి భ్రమించిన తొలితరం అందాల నటి (5)
3. ముందూ, వెనకా ఎవరూ లేని వితంతువు (2)
4. వీడు కాదు (2)
5. ఆంధ్ర భోజుడు (8)
6. గాలి, ఉసురు, జీవం (2)
8. రోగం (2)
10. కావ్యం అంకితం తీసుకున్నవాడు (4)
12. శిరస్సు (2)
14. శర్వానంద్, అనుపమా పరమేశ్వరన్‌ల సంక్రాంతి సినిమా (7)
16. పరిహాసం, వేళాకోళం (4)
18. చిలుక పలుకుల సంగీత దర్శకుడు (4)
20. వ్యాఘ్రం (2)
23. సహాయం, అండ, ఒట్టు (2)
24. అందుచేత, అడవి (2)
25. వాసన (2)
26. ప్రేగు రూపాంతరం (2)
27. అడ్డంగా చాచిన రెండు చేతుల మధ్య కొలత (2)

### పదశోధన - 430 జవాబు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 గ | డి | 2 యా | రం | ■ | 3 వి | ఘ్నం | ■ | 4 లా | 5 వా |
| జం | ■ | చ | ■ | 6 ని | న్న | ■ | 7 ఎ | ■ | ర |
| ■ | 8 బొం | కు | ■ | ■ | 9 పా | క | లు | ■ | స |
| 10 మి | గు | లు | భూ | 11 ము | లు | ■ | 12 క | 13 వి | త్వం |
| ■ | రు | ■ | ■ | డు | ■ | 14 సం | తో | షం | ■ |
| ■ | 15 గొం | గ | 16 ళి | పు | రు | గు | లు | ■ | ■ |
| 17 రా | తు | ■ | 18 కా | లు | ■ | ■ | ■ | 19 గుం | 20 జ |
| ■ | ■ | 21 ము | ద్ర | ■ | 22 వి | మా | 23 నం | ■ | ల |
| 24 చెం | 25 బు | ■ | భ | ■ | ది | ■ | వ | ■ | తా |
| 26 ప | టా | లం | ■ | 27 మా | య | ల | ప | కీ | రు |

## • ఫుడ్ పిరమిడ్

పక్కన కనిపిస్తున్న ఫుడ్ పిరమిడ్‌లో కనిపిస్తున్న అక్షరాలలో కొన్ని ఆహార పదార్థాలు, వంటకాల పేర్లు దాగున్నాయి. కనుక్కోనేందుకు ప్రయత్నించండి. ఇది మీ పాకశాస్త్ర పరిజ్ఞానానికి ఒక తమాషా పరీక్ష. ఈ అక్షరాలతో ఎన్ని ఎక్కువ పదాలను కనుక్కోగలిగితే మీకు అంత ఎక్కువగా పాక పరిజ్ఞానం ఉన్నట్లు లెక్క. ఒక్కో పదానికి ఒక్కో మార్కు లెక్కన ఎన్ని వస్తాయో చూసుకోండి.

సం
దే శ్ ర
గ డా మో సా స
గు ల్లా దో వ కా య వ్వ
కే రి గ్గ బి య్యం పా వం జ ప్పం

**మార్కులు**

ఫర్వాలేదు: 8

బాగుంది: 10

అద్భుతం: 12



## • పదవినోదం

గడులలో అస్తవ్యస్తంగా ఇచ్చిన అక్షరాలను సరైన వరుసలో పదాలుగా అమర్చండి. గడులలో వృత్తాల నడుమ ఇచ్చిన అక్షరాలతో వచ్చే అర్థవంతమైన పదబంధాన్ని కనుక్కోండి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | విం | ను | క | దు | |
| 2 | హా | స | ల | రు | దా |
| 3 | నం | త | రి | వ | హ |
| 4 | జ | భో | శం | కాం | దే |
| 5 | కం | లో | డు | పా | |

**పదవినోదం జవాబులు**

క ల హ భో జ ను డు

1. కనువిందు 2. సలహాదారు 3.హరితవనం 4. కాంభోజదేశం 5.పాడులోకం

## సుడోకు - 191

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 2 | | 8 | | | 7 | 3 | | |
| | 4 | | 8 | | | | | |
| | 7 | | | | | 9 | 6 | |
| | 6 | 5 | | | | | | |
| | 3 | 1 | | | | 6 | | 5 |
| | 2 | 9 | 6 | | | | 7 | |
| 6 | 9 | | | | | | 2 | 1 |
| | | | | | | | | |
| | | | | 5 | 1 | | | 6 |

కఠిన స్థాయి 1 2 3 4 5

### సుడోకు - 190

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 3 | 8 | 1 | 2 | 7 | 6 | 9 | 4 | 5 |
| 4 | 5 | 7 | 8 | 3 | 9 | 2 | 1 | 6 |
| 9 | 2 | 6 | 5 | 4 | 1 | 8 | 7 | 3 |
| 8 | 1 | 3 | 6 | 5 | 4 | 7 | 2 | 9 |
| 6 | 4 | 5 | 9 | 2 | 7 | 1 | 3 | 8 |
| 7 | 9 | 2 | 1 | 8 | 3 | 5 | 6 | 4 |
| 5 | 7 | 9 | 3 | 6 | 2 | 4 | 8 | 1 |
| 1 | 6 | 4 | 7 | 9 | 8 | 3 | 5 | 2 |
| 2 | 3 | 8 | 4 | 1 | 5 | 6 | 9 | 7 |

## 16 ఏప్రిల్ నుంచి 22 ఏప్రిల్ 2017 వరకు

సింహంభట్ల సుబ్బారావు
జ్యోతిష్య పండితులు





**మేషం:** (అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)
మందకొడిగా ప్రారంభమైన పనులు క్రమేపీ పుంజుకుంటాయి. స్థిరాస్తి వివాదాలు పరిష్కార దశకు చేరతాయి. ఆర్థిక పరిస్థితి మెరుగ్గా ఉంటుంది. నిరుద్యోగులకు ఉద్యోగావకాశాలు. ప్రముఖులతో పరిచయాలు. పుణ్యక్షేత్రాలు సందర్శిస్తారు. వ్యాపారాలలో అభివృద్ధి. ఉద్యోగులకు పైఅధికారుల మెప్పు. పారిశ్రామికవర్గాలు అనుకున్నది సాధిస్తారు. పసుపు, గులాబి రంగులు, తూర్పుదిశ ప్రయాణాలు అనుకూలం. విష్ణుసహస్రనామ పారాయణ చేయండి.



**వృషభం:** (కృత్తిక 2,3,4 పా, రోహిణి, మృగశిర 1,2 పా.)
ఆర్థిక వ్యవహారాలు నిరాశ కలిగిస్తాయి. అనుకున్న కార్యక్రమాలు నిదానంగా పూర్తి చేస్తారు. ఆరోగ్యపరంగా చికాకులు. ఆలోచనలు కార్యరూపం దాలుస్తాయి. ప్రతిభాపాటవాలు వెలుగులోకి వస్తాయి. విద్య, ఉద్యోగావకాశాలు దక్కుతాయి. వ్యాపారాలు లాభిస్తాయి. ఉద్యోగవర్గాలకు ఊహించని మార్పులు ఉండవచ్చు. కళాకారులకు శుభవార్తలు. నీలం, లేత ఆకుపచ్చ రంగులు, ఉత్తరదిశప్రయాణాలు అనుకూలం. ఆంజనేయ దండకం పఠించండి.



**మిథునం:** (మృగశిర 3,4, ఆరుద్ర, పునర్వసు 1,2,3 పా.)
కొత్త వ్యక్తులు పరిచయమై సహాయపడతారు. ఆదాయం కొంత పెరిగే సూచనలు. నిరుద్యోగులకు ఉద్యోగయోగం. కీలక నిర్ణయాలు తీసుకుంటారు. ఆస్తి వ్యవహారాలలో చికాకులు తొలగి లబ్ధి పొందుతారు. జీవితాశయం నెరవేరుతుంది. వాహనాలు, గృహం కొనుగోలు చేస్తారు. తీర్థయాత్రలు చేస్తారు. వ్యాపారాలు ఉత్సాహవంతంగా సాగుతాయి. ఉద్యోగులకు ఉన్నతస్థితి లభిస్తుంది. రాజకీయవర్గాలకు విదేశీ పర్యటనలు. కుటుంబంలో చికాకులు. పసుపు, తెలుపు రంగులు, పశ్చిమదిశ ప్రయాణాలు అనుకూలం. సుబ్రహ్మణ్యాష్టకం పఠించండి.



**కర్కాటకం:** (పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష)
పనులు సకాలంలో పూర్తి చేస్తారు. సంఘంలో గౌరవం పెరుగుతుంది. బంధువుల నుంచి కీలక సందేశం అందుతుంది. భూవివాదాలు పరిష్కారదశకు చేరతాయి. వివాహాది శుభకార్యాలకు హాజరవుతారు. ప్రముఖుల సహాయం పొందుతారు. ఇంటి నిర్మాణాలు చేపట్టే అవకాశముంది. రాబడి సంతృప్తికరంగా ఉంటుంది. వ్యాపారాలు లాభసాటిగా ఉంటాయి. ఉద్యోగులకు కొత్త ఆశలు. పారిశ్రామికవర్గాలకు సంస్థల ఏర్పాటులో విజయం చేకూరుతుంది. ఎరుపు, నేరేడు రంగులు, దక్షిణదిశ ప్రయాణాలు అనుకూలం. శివాష్టకం పఠించండి.



**సింహం:** (మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)
కొంత నిరాశ ఎదురైనా క్రమేపీ అనుకూల పరిస్థితులు నెలకొంటాయి. కుటుంబంలో శుభకార్యాలు నిర్వహిస్తారు. పలుకుబడి కలిగిన వ్యక్తులు పరిచయమవుతారు. చిన్ననాటి మిత్రులను కలుసుకుని ఉల్లాసంగా గడుపుతారు. నిరుద్యోగుల ఆశలు నెరవేరతాయి. ఆహ్వానాలు అందుతాయి. వాహనయోగం. కొన్ని ముఖ్య నిర్ణయాలు తీసుకుంటారు. వ్యాపారాలు విస్తరిస్తారు. ఉద్యోగులకు పదోన్నతులు. రాజకీయవర్గాలకు సత్కారాలు. గులాబి, లేత ఎరుపు రంగులు, పశ్చిమదిశ ప్రయాణాలు అనుకూలం. విష్ణుధ్యానం చేయండి.



**కన్య:** (ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త1,2 పా.)
కొన్ని కార్యక్రమాలు శ్రమానంతరం పూర్తి కాగలవు. ఆర్థిక పరిస్థితి ఇబ్బంది కలిగించినా అవసరాలు తీరతాయి. స్థిరాస్తి వివాదాలు పరిష్కారం కాగలవు. ఇంటి నిర్మాణాల్లో అవరోధాలు తొలగుతాయి. విద్యార్థులు, నిరుద్యోగులకు కృషి ఫలిస్తుంది. ఉద్యోగులకు పైస్థాయి అధికారుల సహాయం ఉంటుంది. కళాకారులకు అవకాశాలు అప్రయత్నంగా లభిస్తాయి. వారం చివరిలో స్వల్ప అనారోగ్యం. ధనవ్యయం. ఆకుపచ్చ, పసుపు రంగులు, ఉత్తరదిశ ప్రయాణాలు అనుకూలం. దుర్గామాత స్తోత్రాలు పఠించండి.



**తుల:** (చిత్త 3,4, స్వాతి, విశాఖ1,2,3 పా.)
ఆదాయం కంటే ఖర్చులు అధికంగా ఉంటాయి. అప్పులు చేయాల్సి వస్తుంది. బంధువులతో తగాదాలు. మీ మంచితనాన్ని గుర్తించకుండా కొందరు అపవాదులు మోపుతారు. సన్నిహితుల సహాయంతో ముఖ్యమైన కార్యక్రమాలు పూర్తి చేస్తారు. ఆలయాలు సందర్శిస్తారు. ఆరోగ్యపరంగా చికాకులు ఎదురవుతాయి. వ్యాపారాలు నిరాశాజనకం. ఉద్యోగులకు శ్రమ పెరుగుతుంది. వాహనయోగం. నీలం, లేత ఆకుపచ్చరంగులు, హనుమాన్ ఛాలీసా పఠించండి.



**వృశ్చికం:** (విశాఖ 4 పా., అనూరాధ, జ్యేష్ఠ)
పట్టిందల్లా బంగారమే అన్నట్లుగా ఉంటుంది. సన్నిహితులు, సోదరుల నుంచి విశేషంగా సహాయం అందుతుంది. వ్యవహారాలు విజయవంతంగా పూర్తి చేస్తారు. సంఘంలో పలుకుబడి పెరుగుతుంది.విద్యార్థులు, నిరుద్యోగులు అనుకున్న లక్ష్యాలు సాధిస్తారు. పుణ్యక్షేత్రాలు సందర్శిస్తారు. వ్యాపారాలలో ఆశించిన లాభాలు తథ్యం. ఉద్యోగులకు పదోన్నతులు. కళాకారులకు సన్మానాలు. గులాబి, నేరేడు రంగులు, ఆదిత్య హృదయం పఠించండి.



**ధనుస్సు:** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)
దీర్ఘకాలిక సమస్యలు పరిష్కారమైన ఊరట లభిస్తుంది. కష్టసాధ్యమైన పనులు కూడా పట్టుదలతో పూర్తి చేస్తారు. చిరకాల మిత్రులను కలుసుకుంటారు. ఇంటిలో శుభకార్యాలు నిర్వహిస్తారు. రాబడి ఆశాజనకంగా ఉంటుంది. విద్యార్థులకు అనుకూలమైన ఫలితాలు లభిస్తాయి. ఆలోచనలు కార్యరూపం దాలుస్తాయి. వ్యాపారాలు విస్తరిస్తారు. ఉద్యోగులకు విధుల్లో ప్రశంసలు అందుతాయి. పారిశ్రామికవర్గాలకు నూతనోత్సాహం. కుటుంబంలో చికాకులు. ఎరుపు, తెలుపు రంగులు, దక్షిణదిశ ప్రయాణాలు అనుకూలం. దేవీస్తుతి మంచిది.



**మకరం:** (ఉత్తరాషాఢ 2,3,4, శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)
కొత్త విషయాలు తెలుసుకుంటారు. ప్రతిభను చాటుకుంటారు. సంఘంలో విశేష గౌరవమర్యాదలు పొందుతారు. జీవితభాగస్వామి ద్వారా ధనలాభ సూచనలు. అనుకున్న రాబడి పొందుతారు. వాహనాలు, గృహం కొనుగోలు యత్నాలు కలసివస్తాయి. సభలు, సమావేశాలలో పాల్గొంటారు. శ్రమ ఫలిస్తుంది. వ్యాపారాలు మరింత వృద్ధి చెందుతాయి. ఉద్యోగులకు ఉన్నతహోదాలు దక్కవచ్చు. కళాకారులకు కొత్త అవకాశాలు తథ్యం. నీలం, నేరేడు రంగులు, పశ్చిమదిశ ప్రయాణాలు అనుకూలం. కనకదుర్గాస్తోత్రాలు పఠించండి.



**కుంభం:** (ధనిష్ఠ 3,4, శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా.)
ఆర్థిక వ్యవహారాలు సంతృప్తినిస్తాయి. కొన్ని సమస్యలు వాటంతటవే తీరతాయి. సోదరులు, మిత్రులతో ఉత్సాహంగా గడుపుతారు. శ్రమకు తగ్గ ఫలితం దక్కుతుంది. భూములు, వాహనాలు కొనుగోలు చేస్తారు. ఆత్మీయుల నుంచి ఆహ్వానాలు రాగలవు. ప్రత్యర్థులు మిత్రులుగా మారే అవకాశం. వ్యాపారాలు లాభసాటిగా ఉంటాయి. ఉద్యోగస్తుల సేవలకు తగిన గుర్తింపు లభిస్తుంది. పారిశ్రామికవర్గాలకు ప్రభుత్వం నుంచి ముఖ్య సమాచారం అందుతుంది.నలుపు, లేత పసుపు రంగులు, తూర్పుదిశ ప్రయాణాలు అనుకూలం. గణేశాష్టకం పఠించండి.



**మీనం:** (పూర్వాభాద్ర 4 పా., ఉత్తరాభాద్ర, రేవతి)
అనుకున్న పనులు పూర్తి చేస్తారు. ఆర్థిక విషయాలు నిరాశ కలిగిస్తాయి. పలుకుబడి కలిగిన వారితో పరిచయాలు. సంఘంలో గౌరవం దక్కుతుంది. ఆలయాలు సందర్శిస్తారు. నిరుద్యోగులకు నూతన ఉద్యోగయత్నాలు సానుకూలమవుతాయి. వ్యాపార లావాదేవీలు ఊపందుకుంటాయి. ఉద్యోగులకు పనిభారం పెరిగినా మంచి గుర్తింపు రాగలదు. రాజకీయవర్గాలకు విదేశీ పర్యటనలు. వారం మధ్యలో ధనవ్యయం. శ్రమాధిక్యం. ఎరుపు, లేత గులాబి రంగులు, ఉత్తరదిశ ప్రయాణాలు అనుకూలం. హనుమాన్ చాలీసా పఠించండి.

